# కొత్తపల్లి

తెలుగు పిల్లల ఈ(e) మాసపత్రిక

అక్టోబరు 2010



# కొత్తపల్లి

## తెలుగు పిల్లల ఈ (e) మాస పత్రిక

సంచిక:7 అక్టోబరు 2010 సంపుటి: 3

( http://kottapalli.in లోని e - సంచికకు పుస్తక రూపం )

### ఈ సంచికలో. . . .



నలుగురు మిత్రుల కథ





ఈ మాసపు ముఖచిత్రం

"మహాత్ముడు-చిన్నబాబు"




# మహాత్ములు

ఒక తల్లికి గొప్ప చింత పట్టుకున్నదట.

ఆమె కొడుక్కి స్వీట్ల పిచ్చి. తినేందుకు తీపి వస్తువులేమైనా కావాలని ప్రతిరోజూ మారాం చేసేవాడు.

వాడికి స్వీట్లు తినీ తినీ లేనిపోని రోగాలు ఎక్కడొస్తాయోనని తల్లికి భయం.

ఎంతో ప్రయత్నం చేసింది; ఎన్నో రకాలుగా చెప్పి చూసింది- పిల్లవాడు వినలేదు.

రోజూ స్వీట్లు తింటూనే ఉన్నాడు.

ఎవరో అన్నారు-"చూడమ్మా! ఇట్లా నువ్వు చెబితే మానడు. శంఖంలో పోస్తేనే తీర్థం అవుతుందట. ఎవరైనా గొప్పవాళ్లతో చెప్పించు. వాళ్ళమీది గౌరవంతోనన్నా మీవాడు స్వీట్లు తినటం మానేస్తాడు" అని.



వాళ్ళింట్లో అందరికీ రామకృష్ణ పరమహంస అంటే గురి. "ఎవరిచేతో ఎందుకు? ఆయన చేతే చెప్పిస్తాను" అనుకున్నదా తల్లి. కొడుకును వెంటబెట్టుకొని ఆయన దగ్గరికి వెళ్ళింది.

సమస్యను శ్రద్ధగా విన్నాడాయన. "తల్లీ! నేను చెబుతాను

వాడికి. అయితే ఇప్పుడు కాదు- ఒక పదిహేను రోజులాగి, రా!" అన్నాడు.

తల్లి పదిహేను రోజుల తరువాత మళ్లీ తీసుకెళ్లింది కొడుకును. రామకృష్ణుడన్నాడు- "అయ్యో! ఇప్పుడే ఏమీ చెప్పేట్లు లేదు తల్లీ! ఇంకొక పదిరోజులాగి రండి" అని.

పది రోజుల తర్వాత మళ్లీ పది రోజులు- ఇట్లా ఐదారు సార్లు జరిగింది.

చివరికి రామకృష్ణుడు పిల్లవాడిని దగ్గరికి తీసుకొని, "బాబూ! స్వీట్లు అంతగా తినకూడదు- పళ్ళు పాడైపోతాయి. ఆరోగ్యం కూడా పాడౌతుంది. స్వీట్లు మానేసేందుకు ప్రయత్నించు, సరేనా?" అన్నాడు.

పిల్లవాడు 'సరే'నని తలూపాడు. అయిపోయింది- అన్ని రోజులు తిరిగి తిరిగి వేసారి చూసిన ఇంటర్వ్యూ అయిపోయింది ఒక్క నిముషంలో! రామకృష్ణుడు తనపని తాను చూసుకోవటం మొదలుపెట్టాడు.

తల్లికే అర్థం కాలేదు: "ఈ రెండు ముక్కలు చెప్పేందుకు ఇన్నిసార్లు తిప్పాలా? మొదటిసారే చెప్పేస్తే ఏం పోయె?" అని. కుతూహలాన్ని ఆపుకోలేక, వెనక్కి వచ్చి మరీ అడిగింది పరమహంసను.



ఆయన సిగ్గు పడుతున్నట్లు నవ్వాడు. "ఏం లేదు తల్లీ! వాడెలా తింటాడో నేనూ అలాగే, ఇష్టంగా తింటాను స్వీట్లు. నేను తింటూ వాడికి ఎలా చెప్పను, తినద్దని? అందుకని పదిహేను రోజులు సమయం కోరాను. ఆలోగా నేను స్వీట్లు మానేద్దామనుకున్నాను. కానీ ఏం చేసేది? ఈ నాలుక ఆగలేదు. చివరికి, దానితో పోరాడి గెలిచేందుకు ఇన్ని రోజులు పట్టింది" అన్నాడు రామకృష్ణుడు.

నమ్మినదాన్ని ముందుగా తాము ఆచరించి చూసి, ఆ

## కొత్తపల్లి అక్టోబరు 2010

తర్వాతగానీ ఇతరులకు సలహాలనివ్వని ఇలాంటి మహాత్ములు అరుదు.  అలాంటి కొద్దిమంది మంచివాళ్లలో ఒకరు, గాంధీజీ.  అక్టోబరు రెండవ తేదీన గాంధీ జన్మదినం సందర్భంగా, ఆయనకున్న అనేక రూపాలలో కొన్నిటిని ఆవిష్కరిస్తున్నాయి, ఈమాసపు అనువాద కథలు. మనందరం రకరకాల పనుల్ని సొంతంగా, సంతోషంగా చేసుకునేందుకు  ఇవి ప్రేరణనిస్తాయని ఆశిద్దాం.

ఆగస్టునెల  " బొమ్మకు కథ" కోసం లలిత గారు ఇచ్చిన "భయం" చిత్రానికి పాఠకులు చక్కగా స్పందించారు.  ఒక్క అరవింద హైస్కూలునుండే మూడు కథలు రావటం మాకందరికీ చాలా సంతోషాన్నిచ్చింది. ఆ చిన్నారులకు, వారిని ప్రోత్సహించిన పెద్దలకు, అందరికీ అభినందనలు.

శుభాకాంక్షలతో,

కొత్తపల్లి బృందం.



# నీతిచంద్రిక

**12 వ భాగం**

*రచన: కీ.శే. పరవస్తు చిన్నయ సూరి* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*

*జరిగిన కథ: ఎద్దు రంకెను విని సింహం కూడా నిశ్చేష్టమైపోయింది. అయితే వాస్తవాన్ని ఊహించిన నక్కలు రెండు, సింహానికి ఆ సంగతిని చెప్పాలా వద్దా అని చర్చించుకుంటాయి. సింహాన్ని మంచి చేసుకొని మంత్రి పదవి సంపాదించుకోవాలన్న ఆశతో దమనకం సింహం దగ్గరికి వెళ్తుంది. ఇక చదవండి- నీతి చంద్రిక పన్నెండవ భాగం..*

అప్పుడు దమనకుడు "దేవా, మీ కను సన్నలలోని ఈ వన సీమలో నివసించే ఏ ప్రాణికీ చిన్నపాటి కొరత కూడా ఉండదు. ఇక తమరి సేవకులమైన మా క్షేమం అడగవలసిన పని ఏమున్నది? అవసరమైనప్పుడు సేవకుడు యజమాని పిలువకనే వచ్చి, తగిన సమయంలో మంచి చెడ్డలు వివరించాలి. స్వామి హితాన్ని సరిగా పట్టించుకోని సేవకుడు ఎంత మేలు కోరేవాడు అయినప్పటికీ, నిజానికి స్వామిద్రోహి కిందే లెక్క. అలాంటి స్వామి-ద్రోహికి, ఏ చిన్నపాటి మేలు కూడా జరగదు. మంచి చెడులను స్వయంగానే గ్రహించగలిగే

తమవంటి గొప్పవారికి, మాబోటి 'చిన్న ప్రాణులనుండి తెలుసుకోవలసిన అగత్యం వచ్చిందే' అని విచారించవలసిన అవసరం లేదు. కళ్ళున్నవాడికే దీపం అవసరం గాని, గుడ్డివాడికి దీపంతో పనిలేదు గదా! ఒక్క సంగతి విన్నవించుకుంటాను, చిత్తగించండి:



అనేక ప్రదేశాలు తిరగటం, పండితులతోటి నిరంతర సహవాసం, బహు కావ్యాలు,శాస్త్రాలు చదవటం, రాజాస్థానాలలో బహుకాలం ఉండి సేవించటం- ఈ నాలుగూ ఎలాంటివాడిలోనైనా వివేకాన్ని పెంచుతాయి. ఈ నాలుగింటిలో ఏ ఒక్కటీ లేనివాడు నూతిలోని కప్ప మాదిరి, 'తన ముక్కుకు మీద ఉండేదే ఆకాశం; తను ఉండే ఇరుకైన సందే ప్రపంచం' అనుకొని, కేవలం తను బ్రతుకుతున్నందుకే సంతోషపడుతూ, లోకపు తీరు తెలీక, అజ్ఞాని అయి నశిస్తాడు. ఏలినవారి పాదాలవద్ద చిరకాలంగా సేవచేసుకుంటూ బ్రతుకుతున్న మాబోటి చదువురానివాళ్ళు కూడా విద్యావివేక సంపన్నులౌతున్నారంటే అది తమరి సన్నిధి ప్రభావం కాక, మరేమిటి? యజమాని మేలుకోరే సేవకుడు 'నన్ను అడగలేదే' అని అనుకోకూడదు- సందర్భానుసారం ఏది అవసరమో దాన్ని తప్పక చెప్పాలి. అయినప్పటికీ- 'స్వామి తప్పుగా తలుస్తాడేమో' అని మనస్సుకు భయం కలుగుతున్నది" అన్నది.

అది విని పింగళకుడు "దమనకా! నువ్వు మాకు ప్రియ సేవకుడివి. నువ్వు చెప్పిన దానిని మేం తప్పకుండా స్వీకరిస్తాం. మేమేమైనా నీకు క్రొత్తవాళ్ళమా? ఎందుకు, అలా జంకు-తున్నావు? నీ మనస్సుకు ఏది తోస్తే అది చెప్పవచ్చు" అన్నది.

అప్పుడు దమనకుడు చేతితో నోటిని

మూసుకొని పింగళకుని మాటలు విన్నది. ఆపైన అది "చిత్తం చిత్తం!" అని, "దేవా! ఇంతకుముందు తమరు యమునా నదీ తీరానికి వెళ్ళి, అక్కడ నిశ్చేష్టుడైనట్లు అనిపించే విధంగా కొంతసేపు బొమ్మలాగా నిలబడి, ఆపైన వెనక్కి తిరిగి ఇంటికి చేరుకున్నారు. తమరు ఇలా ఎందుకు చేశారో అర్థం కాక, నా మనసు కలత చెందింది. ఈ సంగతి తమకు విన్నవించుకునేందుకే తమరి సేవకుడు వేచి ఉన్నాడు" అన్నది.



అప్పుడు పింగళకుడు "దమనకా! విను. నువ్వు మాకు చాలా దగ్గరివాడివి. నీనుండి దాచవలసిన సంగతి మాకు ఏదీ లేదు. సమస్త జీవులకూ ఆధారమైన ఈ అడవి యావత్తూ మా ఆధీనంలోఉన్నది. ఈ ప్రదేశంలో మా ఆదేశం లేకుండా ఆకైనా కదలదు- అయితే, ఈ రోజు ఒక విపరీతం జరిగింది- అది ఏమిటో విను. దాహంతోయమునా నదీ తీరానికి పోతున్న మాకు, ఉరుము లాంటి అరుపు ఒకటి వినబడింది. ఆ శబ్దం వినబడగానే నిశ్చేష్టులమై నిలచిపోయాము. మనసులో ఏమాత్రం భయమనేది లేకుండా ఇంత గట్టి అరుపును వెలయించిన ఆ జంతువేదో చిన్నది కాదని నాకు అనిపిస్తున్నది. ఈ ప్రపంచంలోకెల్లా అతిగొప్ప వీరుడు ఇతరుల గొప్పతనాన్ని విని సహించగలడా? బలహీనుడు కూడా పగవాడిని పట్టించుకోకుండా వదలడే, ఇక బలవంతుడు ఎట్లా వదలుతాడు? ఎంతటి వీరుడైనా సరే, బలగర్వంతో శత్రువును ఉపేక్షించినట్లైతే, లోకులు అలాంటివాడిని బలహీనుడనీ, పిరికివాడనీ నిందిస్తారు. వద్దని చెప్పకుండా మూకుడుతో నోళ్ళు మూస్తే ఎలాగ? అలాంటి నిందకు గురవ్వటం కంటే చచ్చిపోవటమే మేలు కాదా? ఊరికే చచ్చిపోవటం కంటే పోరాడటమే మంచిది- దైవ వశాన శత్రువే చంపనీగాక, అదే

శ్రేయస్కరం. అందువల్ల, 'ఇప్పుడే శత్రువుకు వ్యతిరేకంగా పోదాము' అనేది ఒకటి-

ఇక, శత్రువును వ్యతిరేకించటమే ముఖ్యం అయితే, దానికి తగిన ఉపాయాన్ని వెతకాలి. బలవంతుడైన పగవాడిని ఉపాయంతో గెలవాలి. కాబట్టి ఇప్పటికి ప్రక్కకు తొలగి పోదాం, ఆ తర్వాత దేశకాలాలను అనుసరించి, కావలసిన ఉపాయాన్ని వెతుక్కొని, శత్రువును శిక్షించవచ్చు- ఇది రెండవది.

ఈ రెండింటిలోనూ నీకు ఏది సరైనదనిపిస్తున్నదో చెప్పు" అన్నది.



అప్పుడు దమనకుడు కొంతసేపు ఆలోచించినట్లుండి, చివరికి "కారణం తెలియకుండా తొందరపడకూడదు. కేవలం శబ్దం విని ఎక్కువ భీతి చెందటం కూడా తగదు-

**నక్క-నగారా కథ**

ఇదివరకు ఒక నక్క అడవిలో తిరుగుతూ ఉన్నది- దానికి ఎక్కడా ఆహారం దొరకలేదు. కడుపు ఆకలితో నకనకలాడుతూంటే అది చాలా బలహీనపడింది. ఆ సమయంలో దానికి ఒకచోట ముక్కలు ముక్కలై నేల మీద పడి ఉన్న రథాలు కనబడ్డాయి. విరిగిన తొండాలు, ముక్కలైన దంతాలతోటి, పెద్దపెద్ద కొండలేమో అనిపిస్తూ, చచ్చి పడి ఉన్న ఏనుగుల గుంపులు ఎదురయ్యాయి. ముందు కాళ్ళు విరిగి, డొక్కలు తెగి పడి, మెడలు వంకర తిరగ్గా, వెల్లకిలా పడిఉన్న గుర్రాలు ఉన్నాయక్కడ. గొప్ప పరాక్రమం ఒలుకుతూ, పెదవి కొరుక్కుంటూ, చూపుల్లో బెదిరింపు ధోరణిని ఇంకా వీడని తలలు చెల్లా చెదరుగా పడి ఉన్నై. కత్తుల్ని ఇంకా వదలని చేతులు, గొప్పగా పోరాడి మరణించిన వీరుల సమూహాలతో నిండి, భయంకరంగాను, నిర్జనంగాను ఉన్న ఆ రణభూమిని చూడగానే నక్క సంతోషంగా ఆ

భూమి దగ్గరికి పోబోయింది.

అంతలో దానికి భయంకరమైన శబ్దం ఒకటి వినబడింది. ఘోరమైన ఆ శబ్దాన్ని వినగానే నక్క గుండెలు బ్రద్దలయినట్లైంది. అది బెదిరి ఒక్కసారిగా మూర్ఛపోయింది. కొంత సేపటికి తెప్పరిల్లి, మెల్లగా కను రెప్పలు తెరచి, నలువంకలా చూసింది. గాలికి కదిలే కొమ్మల తాకిడికి "ఢమ్మ ఢమ్మ"న మోగుతున్న నగారా ఒకటి కనబడింది దానికి.



దాన్ని చూశాక నక్కకు భయం పోయింది. మనసులోని విచారం మాయమవ్వగా అది ఆ నగారా దగ్గరికి పోయి, దాని తోలు పటకాలను కొరికి నములుతూ "అరే! దీని వాస్తవం తెలీక భయపడ్డాను. 'ఇప్పుడు గదా, దీని అసలు రూపం బయట పడ్డది! దేనినైనా సరే, విమర్శనాత్మకంగా చూస్తే తప్ప దాని వాస్తవికత తెలిసిరాదు' అని అనుకుంటూ, ఇప్పుడు శ్రద్ధగా నలుదిక్కులా చూసింది. అన్నివైపులా గుట్టలుగా పడి ఉన్న శవాల గుంపులను చూసి అది "ఆహా! ఇట్లాంటి ఆహారాన్ని చుట్టూ ఉంచుకొని కూడా నేను గమనించలేదే! " అని బాధపడుతూ, కావలసినంత మాంసంతిని తనకు నచ్చిన దారిన పోయింది. కాబట్టి, 'కేవలం శబ్దంవిన్నంత మాత్రాన నిర్ఘాంత పోకూడదు' అన్నాను-

తమరు ఆజ్ఞ ఇస్తే చాలు- తమ ఈ సేవకుడు ఈ క్షణమే ఆ చప్పుడు వచ్చిన చోటుకు వెళ్ళి, అది వెలువడిన కారణం ఏంటో కనుక్కొని వచ్చి తమకు విన్నవించుకుంటాడు" అన్నది దమనకం.

పింగళకుడు దాని ముఖంకేసి తేరిపార చూసి, కొంచెం ఆలోచించి "ఇది కూడా ఇప్పటికి సరైన పనే అనిపిస్తున్నది. బాగా పరిశీలించకుండా తొందరపడి ఏ పనైనా చేసి కూడా లాభం ఉండదు. శత్రువు ఎదుట నిలచి

మాట్లాడేటప్పుడు, బలాబలాలను తెలుసుకొని, ఆ సమయానికి తగినట్లు, 'నేను చెప్పి పంపిన మాటలు' అన్నట్లుగా, నీకు తోచిన విధంగా చెప్పి, శత్రువును లొంగదీసుకొనేందుకు ఏ మార్గం కనబడితే దానిని అనుసరించు. నువ్వు అన్నింటా నేర్పు గలవాడివే. నీకు వేరే చెప్పవలసిన పని లేదు. పోయి రా!" అన్నది.




అప్పుడు దమనకుడు గబగబా ముందు శబ్దం వచ్చిన దిక్కును పట్టుకొని పోయి, మైదానాన్ని చేరుకున్నది. ఆ చదును ప్రదేశపు నలుదిక్కులా వెతికి, అది అక్కడున్న అడుగు జాడలను అనుసరించి పోయి, చివరికి ఆ ఎద్దును కనుగొన్నది.

ఆపైన అది సంజీవకుడి దగ్గరికి పోయి "ఓ వృషభేంద్రుడా! నేను ఈ అడవికి రాజైన సింహం- పింగళకుని అనుచరులలో ఒకడిని. నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. మహారాజు గారు తనకు తానుగా నీకు చెప్పమని బోధించి పంపిన మాటల్ని నేను ఇప్పుడు నీకు వినిపిస్తాను, విను-

"ఈ అడవి మొత్తం నా అధీనంలో ఉన్నది. ఈ అడవిలోని జంతువులు అన్నీ నా శాసనానికి లోబడి వర్తిస్తున్నాయి. నువ్వు కూడా నా ఆజ్ఞకు లోబడి ఉండు. ఇంతే కాదు. నా అనుచరులతో కలసి ఉంటానంటే, నా ఆస్థానంలో నీకు తగిన ఉద్యోగం కూడా ఇస్తాను. నీకు ఎలా ఇష్టమైతే అలా చెయ్యి" అని మహారాజు పింగళకులవారు ఆనతిచ్చారు. ఇంతకు ముందు నువ్వు అనాలోచితంగా రంకె వేశావు కాబోలు! దాన్ని విన్న తరువాత మహారాజు నువ్వెక్కడున్నదీ కనుక్కు రమ్మని ఆజ్ఞాపించారు. నువ్వు భయపడకు- ఆ మహానుభావుడు కరుణ కలవాడు, ధర్మం

తెలిసినవాడు- కనుకనే ఆయన మంచివాళ్ళందరికీ ఆశ్రయుడయ్యాడు. నువ్వేమీ సందేహించకుండా నా వెంట రా!" అని చెప్పి ఒప్పించింది.

ఆపైన, సంజీవకం వెనకగా రాగా, అది ముందుగా సింహం దగ్గరికి వెళ్ళి, “స్వామీ, ప్రభువులవారి ఆనతి మేరకు- నేను పోయి, చూశాను. తమరు విన్న ఆ రంకె వేసినవాడు తమరి దయకు పాత్రుడే తప్ప, తమరిని అతిక్రమించేవాడు కాడు. తమరి ధైర్యసాహసాలను గురించి విని, భయభ్రాంతుడై ఉన్నాడు. వాయుదేవుడు గొప్పవైన మహా వృక్షాలను పెకలించి వేస్తాడు గానీ, వంగిపోయే గడ్డిపోచలను ఏమీ చేయక వదిలిపెట్టడా? నిజంగా బలం ఉన్నవాడు తనను ఎదిరించిన వాడిపైన తన బలాన్ని ప్రయోగిస్తాడు తప్ప, బలహీనులను పట్టించుకోడు. అటువంటి గొప్ప గుణాలు తమరికి సహజంగానే అబ్బాయి. అవసరం కనుక ఇంతమాత్రం చెప్పాను గానీ, ఏలినవారికి అసలు చెప్పవలసినదేమున్నది? ఆ శబ్దం చేసినది ఒక పెద్ద ఎద్దు- బుద్ధిమంతుడు: తమరి కొలువులో ఉండదగినవాడు. తమరు సమ్మతిస్తే వాడిని తమ పాదాలవద్దకు తీసుకొని వస్తాను" అన్నది.

చిరునవ్వుతో 'సరే' అన్నట్లు తల ఎగురవేసింది పింగళకం.

(మిగతాది మళ్ళీ.....)




# కృషి

*రచన: U.రేణుక, 9 వ తరగతి, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి.*

సీతారామ పురం అనే ఊళ్ళో నివసించేవాడు రామయ్య. అతనికి ఇద్దరు కూతుళ్ళు, ఒక కొడుకు ఉండేవాళ్ళు. వాళ్ళది చాలా పేద కుటుంబం. రామయ్య కరెంటు పని చేసి కుటుంబాన్ని పోషిస్తుండేవాడు. వాళ్ల పెద్దమ్మాయి అనురాధ, చాలా తెలివైనది- తండ్రి చేస్తున్న పనిని శ్రద్ధగా గమనిస్తుండేది. ఇంటి పనుల్లోతల్లికి సహాయం చేస్తూ ఇంటి వద్దే ఉండేది. అనురాధ చెల్లి, తమ్ముడు మాత్రం బడికి వెళ్ళేవాళ్ళు.

ఒక రోజు రాత్రి వర్షం కారణంగా కరెంటు తీగలు తెగి పడిపోయాయి. జనం బయట తిరగటానికి భయపడుతున్నారు. ఊళ్ళో కరెంటు పని చేసేది తను ఒక్కడే కనుక, వాటిని సరి చేసేందుకు వెళ్ళాడు రామయ్య- ఆ సరిచేయటంలో కరెంటు షాకుకు గురై ఆకస్మికంగా చనిపోయాడు.

అప్పటినుండి అనురాధ కుటుంబానికి పూట గడవటంకూడా కష్టమైంది, అనురాధ తమ్ముడు, చెల్లి ఇద్దరూ చదువులు మానేశారు. తల్లి కూలి పనికి, అనురాధ ఇళ్ళలో పనికి వెళ్ళటం మొదలుపెట్టారు- అయినా ఇల్లు సరిగ్గా నడిచేది కాదు.

అనురాధ పనిచేసే ఇళ్లలో టీచర్ ఒకావిడ ఉండేది. అనురాధ పనికి వెళ్ళేసరికి ఒకరోజున ఆమె పిల్లలకు పాఠాలు చెబుతూ ఇలా అంటున్నది- "ఈ ప్రపంచంలో ఆడవాళ్ళు చేయలేని పనులంటూ ఏవీ లేవు. ఈ రోజుల్లో మహిళలు విమానాలు నడుపుతున్నారు. వ్యాపార రంగంలో రాణిస్తున్నారు. దేశాలను పరిపాలిస్తున్నారు. ఎన్ని కష్టాలు ఎదురైనా, అవమానాలు ఎదురైనా వాళ్ళు వాటిని ఎదుర్కొని నిలిచారు; గొప్పవారని ఖ్యాతి పొందుతున్నారు" అని.

ఆవిడ చెబుతున్న పాఠం అనురాధకు చాలా నచ్చింది. 'తను కూడా ఎందుకు రాణించకూడదు?' అనుకున్నది. అదే రోజున అనురాధ చెల్లి, తమ్ముడు పోట్లాడుకుంటున్నారు: "ధన ధృవం, ధనధృవం కలిపితే విద్యుత్తు ప్రవహిస్తుంది" అంటున్నాడు తమ్ముడు. "కాదు కాదు! ధనధృవం, ఋణధృవం కలిపితే విద్యుత్తు ప్రవహిస్తుంది" అంటోంది చెల్లి. తండ్రి దగ్గర కరెంటు పని నేర్చుకున్న అనురాధ, ఈ సమస్యను టీచరు దృష్టికి తీసుకెళ్ళింది. కరెంటు పనిమీద ఆమెకున్న ఇష్టాన్ని అర్థం చేసుకొని, ఆమెకు విద్యుత్తు గురించిన పాఠాలు వివరంగా నేర్పించటం మొదలు పెట్టారు, టీచరుగారు.

దాంతో ధైర్యం తెచ్చుకున్న అనురాధ, ఊళ్లోనే ఒక 'రిపేరి షాపు' పెడతానన్నది. ముందు వాళ్ల అమ్మ ఒప్పుకోలేదు; అయితే

టీచరు మాట్లాడి, అనురాధ తల్లిని ఒప్పించింది. ఆ దుకాణంలో అనురాధ టివిలు, రేడియోలు, టేపు రికార్డర్లు, సిడి ప్లేయర్లను రిపేర్ చేసేది. ఒక్కోసారి పోరంబోకులు దుకాణం ముందు నిలబడి, ఆమెను ఎగతాళి చేసేవాళ్ళు. కానీ అనురాధ వాళ్ళని అస్సలు పట్టించుకోలేదు. త్వరలో అనురాధ పెట్టిన దుకాణం చాలా పెద్దదైంది- ఇప్పుడు ఆ దుకాణంలో కొత్త టివిలు, టేప్ రికార్డరులు, రేడియోలు, క్యాసెట్లు, డివిడి ప్లేయర్లు అన్నీ అమ్మబడుతున్నాయి!

అనురాధ ఇంటి పరిస్థితులు కూడా ఇప్పుడు చాలా మెరుగు పడ్డాయి: తమ్ముడు ఇంటర్ పూర్తి చేశాడు; చెల్లెలు 10 వ తరగతిలో జిల్లా ఫస్టు వచ్చింది. అనురాధ తల్లి, టీచరుగారు మాత్రమేకాక, ఊళ్లోవాళ్ళూ అనేకమంది ఆమె కృషిని అభినందించటం మొదలు పెట్టారు. పట్టుదలకూ, కృషికీ మారుపేరుగా నిలచి, ఆ ప్రాంతంలో అనేక మందికి ఆదర్శప్రాయురాలైంది అనురాధ!

**జోకులు**

**ఏంవర్కు?!**

అమ్మ: రామూ! ఇంకా ఏమి ఆటలురా? రా, ఇంటికి వచ్చి చదువుకో!

రాము: ఇది కూడా హోం వర్కే అమ్మా!

అమ్మ: ఇదేం హోంవర్కురా?

రాము: ఈ హోంవర్కు మా డ్రిల్ మాస్టారు ఇచ్చారులే.

**మహా ప్రసాదం!**

టీచరు: రామూ! గుళ్ళలో ప్రసాదం ఇచ్చాక బొట్టు ఎందుకు పెడతారో చెప్పు!

రాము: ఒకసారి ప్రసాదం తీసుకున్నవాళ్ళు మళ్ళీ మళ్ళీ ప్రసాదానికి రాకుండా సార్!



# మానవత్వం

రచన: P.మానస, P.అనిత, రిషివ్యాలీ రూరల్ స్కూలు, రిషివ్యాలీ, మదనపల్లి, చిత్తూరు జిల్లా.

ఒక ఊరిలో ఒక బీద రైతు ఉండేవాడు. కొద్దిపాటి వ్యవసాయం తప్ప అతనికి మరే జీవనాధారమూ లేదు. అతని కూతురు, అంజలి. అంజలి రోజూ బడికి పోయి శ్రద్ధగా చదువుకునేది. అన్ని పనులనూ చాలా చురుకుగా చేసేది. ఇంటి పనుల్లో తల్లికి సాయం చేసేది.

అంజలికి ఒక స్నేహితురాలుండేది. ఆమె పేరు అక్షయ. అక్షయ వాళ్ళ నాన్న చాలా పేరున్న పారిశ్రామికవేత్త. వాళ్ళు చాలా ధనవంతులు.

అక్షయకు అంజలి అంటే చాలా ప్రేమ- కానీ వాళ్ళ ఇంట్లో వాళ్ళు మాత్రం అంజలిని చాలా చులకన చేసి మాట్లాడేవాళ్ళు. అంజలి వాళ్ల మాటల్ని పట్టించుకోకుండా, తనకు ఏది ఎంతవరకు అవసరమో అది అంతవరకు చేసుకొని పోతుండేది.

అనుకోకుండా ఒక రోజున అంజలి వాళ్ల అమ్మ అనారోగ్యంతోచనిపోయింది. అటుపైన తండ్రి త్రాగుడుకు బానిసయ్యాడు. రోజు రోజుకు ఇంట్లో కొట్లాటలు ఎక్కువయ్యాయి. ఇల్లు గడవటంకూడా కష్టమైన పరిస్థితులు దాపురించాయి. బడిమానేసి, అంజలి ఇంటి పనులను బాధ్యతగా నెరవేర్చటం మొదలు పెట్టింది. చివరికి ఒకనాడు తండ్రి తాగి వచ్చి, అంజలిని కొట్టి, ఇంట్లోంచి తరిమేశాడు!

అకస్మాత్తుగా ఎవ్వరూ లేని అనాధ అయిపోయింది అంజలి. ఆ రాత్రి సమయంలో తను ఎక్కడికి వెళ్ళాలి? అప్పుడామెకు తన స్నేహితురాలు అక్షయ గుర్తుకొచ్చి, వాళ్ళ ఇంటికి వెళ్ళింది. అంత రాత్రిపూట వచ్చిన మిత్రురాలిని చూసి అక్షయ ఆశ్చర్యపడింది. ఆమెకు అంజలి తన ఇంటి దగ్గర జరిగిన సంగతులన్నిటినీ పూసగుచ్చినట్లు వివరించింది. అంజలిపైన జాలిపడి అక్షయ ఆమెను తనతోపాటు ఉండమని ఆహ్వానించింది; కానీ అక్షయ వాళ్ళ అమ్మానాన్నలు ఇద్దరికీ అది నచ్చలేదు. "ఇలాంటి వాళ్ళని ఇంట్లో ఉంచుకుంటే మన పరువు పోతుంది" అన్నారు వాళ్ళు.

ముందు గదిలో ఉండి వాళ్ల మాటలు విన్న అంజలి చాలా బాధ పడింది. ఇంకా తెల్లవారకుండానే లేచి, ఎవ్వరికీ ఏమీ చెప్పకుండానే బయలుదేరి పోయింది. అక్షయ నిద్రలేచి చూసుకునే సరికి, అంజలి అక్కడ లేదు!

చాలా సంవత్సరాలు గడిచాయి. అక్షయ వాళ్ల నాన్న చాలా సంపద కూడ బెట్టాడు. అయితే రాను రాను వాళ్ళ ఫ్యాక్టరీ పాతదైంది. సమస్యల వలయాల్లో చిక్కుకున్నది. అక్షయ వాళ్ళ నాన్న దాన్ని బాగు పరచే ప్రయత్నంలో, ఉన్న ఆస్తులన్నిటినీ అమ్మేశాడు. చివరికి వాళ్ళు ఉన్న ఇంటిని కూడా అమ్మేసినా అప్పులు తీరని

పరిస్థితి ఏర్పడింది. తనకు ఇక ఆ అప్పుల్ని తీర్చే స్తోమత లేదనీ, వాటిని మాఫీ చేయాలనీ వేడుకుంటూ జిల్లా కలెక్టరు గారికి ఒక అర్జీ పెట్టుకున్నాడాయన.

కలెక్టరుగారు ఆయన్ని తన కార్యాలయానికి రప్పించారు. "మీరు చాలా మందికి సహాయం చేసి ఉంటారు గదా! వాళ్ళనెవరినైనా వచ్చి, మీ బదులు అప్పులు కట్టమనరాదూ? ఇట్లా అప్పులు మాఫీ చెయ్యమంటే ఎలాగ?" అన్నారు.

అక్షయ వాళ్ల నాన్న బిక్క మొగం వేశాడు. ఆనాటివరకూ ఆయన ఎవ్వరికీ నిజంగా సాయం చెయ్యలేదు మరి! అదే సంగతి ఆయన కలెక్టరు గారికి చెప్పాడు.

కలెక్టరు గారు నవ్వారు. "మీకు కనీసం మీ అమ్మాయి అక్షయ ఐనా జామీను ఉంటుందా?" అన్నారు.

అక్షయ పేరు కలెక్టరుగారికి ఎలా తెలిసిందా అని ఆశ్చర్యపడ్డాడు ముసలాయన.

అప్పుడు కలెక్టరు గారు చెప్పారు: "చాలా గడ్డు పరిస్థితుల్లో ఉన్న ఒక చిన్న పాప అంజలి, ఒకరోజు మీ ఇంటికి వచ్చింది. ధనం మత్తులో ఉన్నారు మీరు. ఆ పాపను వెంటనే వదిలించుకున్నారు. అదృష్టం కొద్దీ ఆ పాప ఒక మంచి మనిషి కంట పడింది. ప్రభుత్వంవారి సాయంతో బాగా చదువుకున్నది. చివరికి 'అంజలి- ఐఏఎస్' కాగలిగింది. 'తోటి మనుషులు కష్టాల్లో ఉన్నప్పుడు ఊరుకోకూడదు: తప్పక సాయం చెయ్యాలి' అని అంజలికి బాగా అర్థం చేయించారు మీరు. అందుకని, ఇప్పుడు మీ అప్పును అంజలి తీరుస్తుంది. కలెక్టరుగా కాకపోయినా, తోటి మనిషిగా మీకు ఈ మాత్రం సాయం చేయగలదు ఈ అంజలి" అని.

ముసలాయన సిగ్గుతో తలవంచుకున్నాడు. కలెక్టరు గారు జామీను ఉండటం చేత ఫ్యాక్టరీ తిరిగి ప్రాణం పోసుకున్నది. అక్షయ తండ్రి ఇప్పుడు మారిపోయాడు: అందరికీ సాయం చేస్తూ మంచివాడనిపించుకున్నాడు.



# భయం-1

*(ఆగస్టు నెల బొమ్మకు కథ -'భయం' కువచ్చిన స్పందనల్లో మొదటిది.)*
*రచన: కీర్తి, 10 వ తరగతి(లిల్లీ), అరవింద స్కూల్, విజయవాడ.*

అనగనగా ఒక ఊళ్లో రాము అనే పిల్లవాడు ఉండేవాడు. రాము చాలా తెలివైన పిల్లవాడు; మంచివాడు, ధైర్యవంతుడు కూడాను. ఆశ్చర్యం గొలిపే విషయాలు, విశేషమైన సంగతులంటే అతనికి చాలా ఇష్టం ఉండేది. 'ఇష్టం' అనేకంటే, దాన్ని 'మోజు' అంటే నయమేమో- ఎందుకంటే, అతను తన ఆ 'ఇష్టం' కోసం ఎన్నో కష్టాలు కొని తెచ్చుకున్నాడు!

అనుకోకుండా తెలిసింది రాముకు- తను పూర్వజన్మలో ఒక జమీందారు అని! తమది జమీందారు వంశమట. ఎంతో

విలాసవంతమైన జీవితం గడుపుతుండేవాడట. తనకు పదహారేళ్ళ వయసులో తను పాముల రాజైన ఆదిశేషుడినే చంపేశాడట! రాముకు ఈసంగతిని ఒక మాంత్రికుడు చెప్పాడు. ఆదిశేషుడు ఇప్పుడు తనపైన పగ పట్టాడట; తగిన అవకాశం కోసం వేచి చూస్తున్నాడట. ఎవ్వరూ కనుక్కోలేని విధంగా వచ్చి తనని చంపేందుకే కాచుకొని కూర్చున్నాడట!




అది విన్నప్పటినుండీ రాము చాలా జాగ్రత్తగా ఉండటం మొదలు పెట్టాడు. ఎప్పుడూ దాన్ని గురించే దీర్ఘంగా ఆలోచించసాగాడు. అంతకు ముందున్న ధైర్యం ఏమైందో ఏమో- ఇప్పుడు రాము విపరీతమైన భయాందోళనలకు గురౌతున్నాడు. కంటిలో కునుకు లేదు. పరధ్యానంలోనే ఉండి పోయాడు.

ఇలా ఎన్ని రోజులు గడిచాయో! చివరికి రాము మళ్ళీ ఆ మాంత్రికుడి దగ్గరికే వెళ్ళి 'పరిష్కారం ' ఏంటని అడిగాడు. అప్పుడు చూస్తే, రాము కళ్లలో భయం. అతని శరీరంలో వణుకు. మాట తడబడుతున్నది. మాంత్రికుడు పరిష్కారం చెబుతాడన్న ఆశ ఒక్కటే అతనికి మిగిలి ఉన్నది. ఆ మాంత్రికుడేమో ఏదేదో మాట్లాడుతున్నాడు- పరిష్కారం మాత్రం చెప్పటం లేదు. అసలు ఆ మాంత్రికుడికి ఏమైనా తెలిస్తేనే కదా, చెప్పేందుకు? అతను చెప్పిన కథల్ని రాము అమాయకంగా నమ్మాడు- అంతే తప్ప, అతనికి అసలు ఏలాంటి శక్తులూ లేవు. రాము దగ్గర ఏమైనా డబ్బులుంటే కొట్టేద్దామనేదే అతని పథకం.

మాంత్రికుడు ఏమీ చెప్పకపోయే సరికి, రాము భయంతో ఇంటికి పరుగులు తీశాడు. ఇల్లు చేరుకునేటప్పటికి అతనికి విపరీతమైన జ్వరం. భయంతో అలా రాము చావు అంచుల దాకా వెళ్ళాడు.

ఎన్ని రోజులు చూసినా, పాము మాత్రం రాలేదు. ఇక చచ్చిపోతాడనగా- తెలివి మేలుకున్నది రాముకు. తనకు తెలీని గతాన్ని పట్టుకొని, తనకు తెలీని భవిష్యత్తుకోసం వర్తమానంలో భయపడనక్కర్లేదని అర్థమైంది. దాంతో కథ సుఖాంతం అయ్యింది. రాముకు భయం తీరింది; ఆరోగ్యం మళ్ళీ బాగైంది.

ఇంతకీ ఇదంతా ఎప్పుడు జరిగిందో చెప్పలేదు కదూ? -రాము కలలో!!

**తెలివి!** **జోకు**

వెంగళప్ప, తన ఇద్దరు మిత్రులతో కలిసి దొంగతనానికి వెళ్ళాడు.

వాళ్ళ ఖర్మ కొద్దీ, అదే సమయానికి తుపాకీ పట్టుకున్న పోలీసు అక్కడికి వచ్చాడు అనుమానంగా చూస్తూ.

దొంగలు ముగ్గురూ ఎక్కడ దాక్కోవాలో తెలీక, అక్కడున్న మూడు గోతాల్లోకి దూరి, కదలకుండా కూర్చున్నారు.

పోలీసు మొదటి గోతాన్ని పొడుస్తూ అడిగాడు: ఎవరున్నారు ఇందులో?

మొదటి దొంగ: మ్యావ్! మ్యావ్!

పోలీసు రెండో గోతాన్ని పొడుస్తూ అడిగాడు: ఇందులో ఉన్నదెవరు?

రెండో దొంగ: భౌ! భౌ!

పోలీసు మూడో గోతాన్ని పొడిచి అడిగాడు: ఆ రెండిట్లోను పిల్లి, కుక్క ఉన్నై..మరి ఇందులో ఎవరున్నారు?

వెంగళప్ప(తెలివిగా చెప్పాడు): టమేటాలు!

# భయం-2

*(ఆగస్టు నెల బొమ్మకు కథ-'భయం' కువచ్చిన స్పందన)*

*రచన: G.మహిత, 10 వ తరగతి(లిల్లీ), అరవింద హైస్కూలు, విజయవాడ.*





అనగనగా ఒక ఊరిలో సుశీల అనే అమ్మాయి ఉండేది. ఆమెకి దయ్యాలన్నా, దయ్యాల కథలన్నా ఆసక్తి ఎక్కువ. అందువల్ల ఆమె దయ్యాల పుస్తకాలు ఎక్కువగా చదువుతుండేది. ఆ పుస్తకాల్లో రాసినట్లు, అర్థరాత్రి కుక్కలు అరిచినా, పొగ వచ్చినా, ఇక దయ్యాలు రాబోతున్నాయని అనుకునేది.

ఒకరోజున ఆమె నిద్రపోతుండగా ఒక కుక్క గట్టిగా అరిచింది. ఆ కుక్కకి దెబ్బతగిలి అరిచింది, పాపం. ఆ అరుపులు విని మేలుకున్నది సుశీల. అదే సమయానికి ఇంటి ప్రక్కన ఉన్న చెత్తకుప్పలోంచి పొగ వస్తున్నది. సుశీలకు భయం వేసింది. ప్రక్కనే పడుకున్న అమ్మ-నాన్నల్ని లేపి, "చూడండి- పొగ, కుక్క అరుపు! ఇప్పుడు దయ్యం రాబోతోంది... వచ్చేస్తుంది, ఇక!" అని ఏడిచింది. అమ్మనాన్న ఆమెను దగ్గరికి తీసుకొని సముదాయించి, ఏమీ రావట్లేదని సర్ది చెప్పి పడుకోబెట్టేసరికి వాళ్ల తల ప్రాణం తోకకు వచ్చింది.

అటుపైన సుశీల నిద్రపోయేందుకు ప్రయత్నించింది, కానీ నిద్ర పట్టలేదు. మళ్ళీ

ఒకసారి కుక్క అరిచేసరికి. భయం వేసి చెవుల వరకూ దుప్పటి కప్పుకొని పడుకున్నది.

మరుసటి రోజున తన ఎదురుగుండా ఒక పిల్లి ఉన్నది. అది రాక్షస బల్లిగా మారుతున్నట్లు అనిపించింది సుశీలకు. భయంతో కెవ్వున అరిచింది. అందరూ పరుగెత్తుకొని వచ్చారు- "ఏమైంది, ఏమైంది!?" అంటూ. పిల్లి రాక్షసబల్లిగా మారటం గురించి చెప్పేసరికి, అందరూ ఆమెను పిచ్చిదాన్ని చూసినట్టు చూసి వెళ్ళిపోయారు.

కాసేపటికి, వాళ్ళమ్మకు తాడు అవసరమై, సుశీలను తెమ్మన్నది. సుశీల లేచి వణుక్కుంటూనే వెళ్ళింది- కానీ చూస్తే, తాళ్ళు ఉండాల్సిన చోట నిండా పాములున్నై!! "పాములు! పాములు!!" అని అరవటం మొదలు పెట్టింది కళ్ళు మూసుకొని. సుశీల వాళ్లమ్మ పరుగున వచ్చింది: చేతిలో ఒక కర్ర పట్టుకొని. కానీ, నిజంగా చూసేసరికి, అక్కడ ఉన్నవన్నీ తాళ్ళే! ఒక్క పాము కూడా లేదు!

సుశీల వాళ్ల అమ్మకి అంతా అర్థం అయ్యింది. సుశీలకు ధైర్యం చెప్పింది. తను చూసినవన్నీ నిజంకాదని, అంతా తన భ్రమనే అని వివరంగా చెప్పింది. డాక్టరు గారి దగ్గరికి తీసుకెళ్ళింది. ఆవిడకూడా చాలా సేపు మాట్లాడి, సుశీల భయం పోగొట్టింది. దీనంతటికీ కారణం తను చదువుతున్న దయ్యాల పుస్తకాలే అని తెలుసుకున్నది సుశీల. ఆ కట్టు కథల్ని నమ్మకూడదని అర్థమైంది. వాటిని గురించి ఎక్కువగా ఆలోచిస్తే లేనిపోని అనర్థాలు వస్తాయని తెలిసిందిప్పుడు.

అటుపైన సుశీలకిక భయం వెయ్యలేదు. దయ్యాల కథల్ని చదివినా, "ఎంత చెత్తగా రాశారు! అన్నీ అబద్ధాలే!" అనుకుని నవ్వేది సరదాగా.

# భయం-3



*(ఆగస్టు నెల బొమ్మకు కథ -'భయం' కువచ్చిన స్పందన)*

*రచన: N.యామినికుమారి, 8 వతరగతి-రోజా,*

*అరవింద హైస్కూలు, విజయవాడ.*

ఈ బొమ్మను చూస్తుంటే చాలా భయం వేస్తున్నది. దీనిలో నాకు పెద్ద పెద్ద రాక్షసి బల్లులు, వాటి నీడలు కనిపిస్తున్నాయి. అమ్మో! ఇంత భయంకరమైన జంతువుల్ని ఎన్నడూ చూడలేదు. ఒక్కొక్కసారి ఈ బొమ్మను చూస్తుంటే 'అవన్నీ నిజంగానే నాదగ్గరికి వస్తున్నాయేమో' అనిపించి భయం వేస్తుంది. ఒక్కొక్కసారి 'నేను ఇంత పెద్ద జంతువుల్ని నా కళ్ళారా ఎప్పుడూ చూడలేదు గదా, వీటిని ఒకసారైనా చూస్తే బాగుండు గదా' అనిపిస్తుంది. కానీ 'చూస్తే ఏమైపోతానో' అని ఒక ప్రక్క భయం!

అయితే, ఈ బొమ్మను చూశాక, నేను మా చెల్లికి, తమ్ముడికి ఒక దెయ్యం కథ చెప్పాను. 'అలా చెబితే వాళ్ళిక నా జోలికి రారు, చూద్దాం' అని. నేను అనుకున్నట్లుగానే వాళ్ళు భయపడ్డారు. నా జోలికి రావటం మానుకున్నారు. వాళ్ల భయం చూసి నాకు చాలా నవ్వు వచ్చింది.

'భయానికి నిజంగా అర్థం ఉండదు' అని నాకు అర్థమైంది. "భయం అనే మాటను ఎవరు కనిపెట్టారు, అసలు భయం అంటే ఏమిటి?" అని చాలా మందిని అడగటం మొదలు పెట్టాను. కానీ ఎవరిని అడిగినా సరిగ్గా సమాధానం చెప్పలేకపోయారు. నేనే సొంతగా కష్టపడి, చాలా పుస్తకాలు చదివి, ఎలాగో ఒకలా తెలుసుకున్నా.

అసలు భయం అంటే ఏంటో తెలుసా? భయం అనేది ఒక అలజడి. మనసులో రేగే ఒక చిచ్చు. మనసులో టపాకాయ పేలినట్లు పేలి,

దాన్ని అల్ల కల్లోలం చేస్తుంది. భయం అనేది మన మనసులో రేగే ఒక కలకలం అన్నమాట. మనసులో ఆ కలకలం రేగినప్పుడు, శరీరంలో కూడా దానికి అనుగుణంగా చాలా మార్పులు వస్తాయి. మన ముఖంలోని హావభావాలు మారిపోతాయి. కనుపాపలు పెద్దవౌతాయి. నోరు తెరుచుకుంటుంది. గాలి పీల్చుకునే వేగం మారుతుంది. శరీరంలో హార్మోన్ల వ్యవస్థలో పెను మార్పులు సంభవిస్తాయి. ఇవన్నీ తెలుసుకునే సరికి, 'భయానికి ఇంత చరిత్ర ఉందా' అని ఆశ్చర్యం వేసింది. అప్పటినుండి నేను దేనికీ భయపడటం మానేశాను.

అంతేకాదు, నేను సొంతగా 'భయం' అనే పదాన్ని వాడటమే మానేసి, ఇతరుల్ని భయపెట్టి చూడటం మొదలుపెట్టాను! మా ఇంటికి ఏ పిల్లవాడు వచ్చినా ఈ బొమ్మను చూపించి, ఏదేదో చెప్పేసి, భయపెట్టిస్తున్నాను.

దాంతో వాళ్ళు మా యింటికి రావటం మానేశారనుకోండి, వాళ్ళు పిరికి వాళ్ళన్నమాట. వాళ్ల ధైర్యానికి ఇది ఒక పరీక్ష!

అందుకని, ఇప్పుడే చెప్పేస్తున్నాను- మా ఇంటికి వచ్చేవాళ్ళు కొండంత ధైర్యంతో రండి మరి- సరేనా?

**గోల్కొండ!** **పిచ్చి కవిత**

వెళ్ళాను నేను గోల్కొండ
అక్కడ ఉన్నది ఒక కుండ
కుండ ప్రక్కన ఉన్నాడు గూండా
తింటున్నాడు బోండా
చూపాడు వాడి కండ
భయపడి ఎక్కాను నా హీరో హోండా!

# భయం-4



*(ఆగస్టు నెల బొమ్మకు కథ-'భయం' కువచ్చిన స్పందన)*

*రచన: R.జయరాం రెడ్డి(స్వామి), టైలరు, చెన్నేకొత్తపల్లి.*




కొండాపురంలో రాము-సోము అనే మిత్రులు, సాయంత్రం పశువుల్ని ఇంటికి తోలుకొచ్చిన తర్వాత, పట్నంలో సినిమా చూసేందుకు వెళ్ళారు. వాళ్ళు వెనక్కి తిరిగి వచ్చేసరికి బాగా ఆలస్యమైంది. బస్సు వాళ్లని రోడ్డులో వదిలి వెళ్ళిపోయింది. ఊరు ఇంకొక రెండు కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇద్దరూ నడిచి వెళ్తున్నారు. ఆరోజు అమావాస్య, కటిక చీకటిగా ఉంది. అయినా తెలిసిన దారే, కనుక కబుర్లు చెప్పుకుంటూ పోతున్నారు మిత్రులిద్దరూ.

అంతలో పక్కనే ఉన్న పొదల్లోంచి చిన్నగా గజ్జెల శబ్దం అయ్యింది- ఘల్లు ఘల్లు మని. రాము అగ్గిపుల్ల వెలిగించి, ఆ వెలుతురులో చూశాడు- అక్కడ ఏమీ కనబడలేదు. అంతలోనే దగ్గర్లో వేరే చోటనుండి శబ్దం వినవచ్చింది. అగ్గిపుల్లలన్నీ అయిపోయేంత వరకూ వెతికారు ఇద్దరూ- ఒక చోట వెతికితే మరొక చోటునుండి శబ్దం వినిపిస్తున్నది! ఇక ఇద్దరికీ చెప్పలేనంత భయం వేసింది. ఒకరి చేతులొకరు పట్టుకొని, ఊపిరి బిగబట్టి పరుగు పరుగున ఊరు చేరుకున్నారు. తాము దయ్యాల బారినుండి 'ఆ దేవుడి దయవల్లే

తప్పించుకున్నాం' అనుకున్నారిద్దరూ.

ఇల్లు చేరుకున్నాడు కానీ, రాము మనసంతా గజ్జెల మీదనే ఉంది. పడుకున్నాక కొంతసేపటికి మళ్ళీ వినబడింది గజ్జెల శబ్దం. కెవ్వున అరిచి కూర్చున్నాడు. ఇంట్లో వాళ్ళు పరుగెత్తుకొని వచ్చారు- కాపలా కుక్క కాలికి ఉన్న గజ్జెల్ని చూపించి, పడుకోబెట్టారు.

సోము కూడా రాత్రి లేచి కూర్చున్నాడు. అతనికీ వినబడింది గజ్జెల శబ్దం. ఇంట్లో వాళ్ళు పాపాయి కాలికి ఉన్న గజ్జెల్ని చూపించారు. ఊరుకొమ్మన్నారు.

తెల్లవారాక కూడా రాము-సోములు తేరుకోలేదు. దయ్యాల భయంతో మంచం పట్టారు. రాను రాను కృశించి పోయారు. ఊళ్ళో వాళ్లందరూ వచ్చి చూసి వెళ్తున్నారు. వాళ్లందరికీ కూడా, రాత్రిపూట ఆ దారిలో దయ్యాల గజ్జెల శబ్దం వినబడటం మొదలు పెట్టింది. అందరూ ఆ దారిని వదిలి, వేరే దారుల్లో తిరుగుతున్నారిప్పుడు. మెల్లగా ఆ దారుల్లోనూ గజ్జెల శబ్దాలు మొదలయ్యాయి. ఊళ్లో వాళ్ళు ఇక రాత్రిపూట బయటికి రావటమే మానుకున్నారు.



చివరికి ఒకరోజున అందరూ కలిసి డబ్బులిచ్చి, ఒక భూతవైద్యుడిని పిలిపించుకున్నారు. ఊరికి పట్టిన బెడదను పోగొట్టమని. 1008 నిమ్మకాయలు, 108 పాపరకాయలు, 11 నల్లకోళ్ళు, 1 నల్లమేక సమర్పించుకున్నారు. అమావాస్యరోజు రాత్రిపూట ఆయన పూజ మొదలుపెట్టుకున్నాడు. అన్ని రోడ్లూ తిరిగి పూజలు చేశాడు; ఏవేవో అరిచాడు. చివరికి "ఇక దయ్యం పారిపోయింది- మీలో ధైర్యవంతులు ముగ్గురు నాతోబాటు ఇక్కడే పడుకోండి" అన్నాడు.

కొంచెం సేపైందోలేదో, గజ్జెల శబ్దం మళ్ళీ మొదలయ్యింది! ఈసారి మరింత దగ్గరగా వినబడుతున్నది! ముగ్గురు ధైర్యవంతులూ

కాలిబిర్రున పరుగెత్తారు. మాంత్రికుడికీ భయం వేసింది. పారిపోతూ రాయికి తట్టుకొని క్రింద పడిపోయాడు. దెబ్బకు జ్వరం వచ్చేసింది. మాంత్రికుడూ మంచం ఎక్కాడు.

ఊళ్ళోవాళ్లకు ఇక దిక్కు తోచలేదు. అందరూ కలిసి దండోరా వేయించారు- గజ్జెల దయ్యాన్ని పారద్రోలిన వాళ్లకు 50 వేల రూపాయల బహుమానం ప్రకటించారు.

ఊళ్ళో కంసాలి ఒకడు ముందుకొచ్చాడు చివరికి- "నాకు పదివేలిస్తే చాలు- గజ్జెల శబ్దం ఇక వినబడదు" అన్నాడు. ఎవ్వరూ నమ్మలేదు అతన్ని. చివరికి, ఎవ్వరూ 50 వేలకు కూడా ఆశపడకపోయేసరికి, దిగివచ్చారు. కంసాలినే ప్రయత్నించమన్నారు. ముందస్తుగానే పదివేలూ ఇచ్చేశారు.

ఆ తర్వాత మూడు రోజులకు నిజంగానే గజ్జెల దయ్యం మాయమైపోయింది. ఊరంతా ప్రశాంతత అలముకున్నది!

ఇక ఊళ్ళో వాళ్ళకు ఆపుకోలేనంత ఉత్కంఠ- 'కంసాలి దయ్యాన్ని ఎలా పారద్రోలాడు?' అని. అందరూ పందాలమీద పందాలు వేసుకున్నారు. కంసాలి మాత్రంపెదవి విప్పలేదు. చివరికి అందరూ కలిసి "నువ్వా రహస్యం చెప్పావంటే మిగిలిన ఉమ్మడి సొమ్ము- నలభైవేలూ నీకే ఇచ్చేస్తాం" అని ఆశచూపారు. కంసాలి కరిగాడు- "ముందే ఇవ్వాలి ఆ సొమ్ము కూడా" అన్నాడు. "రహస్యం చెప్పేసిన తర్వాత 'ఓస్ ఇంతేనా' అనకూడదు" అన్నాడు. "నన్ను ఏమీ చెయ్యకూడదు" అన్నాడు. అన్నిటికీ ఒప్పుకున్నారు ఊళ్లోవాళ్ళు.

కంసాలి ఇంటికి వెళ్ళి ఒక పెద్ద పెట్టెను తీసుకొచ్చాడు. గట్టి ఇనుపతీగలతో, బలంగా ఉందా పెట్టె. దానిలో ఒక యాభైకి పైగా ఎలుకలున్నై. ప్రతిదాని కడుపుకూ పొడవాటి, సన్నటి తీగ- ప్రతి తీగకూ ఒక చిన్న గజ్జె కట్టి ఉన్నై. "ఇదిగో- ఇదే, గజ్జెల దయ్యం" అన్నాడు కంసాలి.

ఊళ్ళో వాళ్ళు బిక్కమొఖం వేశారు. "ఇంకా అర్థం కాలేదా?" అన్నాడు కంసాలి. "మా ఇల్లు ఊరి చివర్లో ఉంది- ఇంటినిండా ఎలుకలు చేరుకున్నాయి. పిల్లిని పెట్టుకున్నా పని జరగలేదు- అది పాలు పెరుగుల్ని తిన్నంతగా,

ఎలుకల్ని పట్టట్లేదు. అందుకని నేనో ఉపాయం చేశాను- బోను పెట్టి, చిక్కిన ఎలుకకు చిక్కినట్లు ఓ సన్నటి తంతి, ఒక చిన్న గజ్జె కట్టటం మొదలెట్టాను. ప్రతిరోజూ రాత్రిపూట ఎలుకల్ని ఆహారంకోసం వదుల్తాను- తెల్లవారగానే వాటికి కట్టిన తీగల్ని లాగి, అన్నిటినీ బోనులో పెట్టేస్తాను మళ్ళీ. అలా బందీ అయిన ఎలుకల పుణ్యమా అని, మిగిలిన ఎలుకలేవీ నా యింట్లోకి రాలేదు! మీరేమో వాటిని చూడకనే దయ్యం అనుకున్నారు. నేనేం చెయ్యను? అయినా ఇప్పుడు, మీరంతా కలిసి యాభైవేలు ఇచ్చారు కాబట్టి, నేనీ ఎలుకల్ని పక్కన పెట్టి, ఒక మంచి-గట్టి-ఇల్లు కట్టుకుంటాను- ఎలుకలు రాని ఇల్లు! ఎలుకలబోను అవసరమే ఉండదిక!" అన్నాడు కంసాలి తాపీగా.

ఊళ్ళోవాళ్లకు కంసాలిని కొట్టాలనిపించింది. అయినా ముందుగానే మాట ఇచ్చారు గనక, ఏమీ అనలేక ఊరుకున్నారు. 'భయపడ్డవాళ్ళు నష్టపోతారు' అని నిజంగా అర్థమైంది వాళ్లకి!

**జోకులు**

**టోల్ గేటు!**

టీచరు: ప్రపంచంలో పెద్ద గేటు ఏదిరా?

రాము: కోల్గేటు సార్!

**పెళ్ళి రోజు గుర్తింపు!**

భార్య(పువ్వు బహుమానంగా ఇస్తూ): ఏమండీ! మీకు పెళ్ళిరోజు శుభాకాంక్షలండీ!

భర్త(పేపరు చదువుకుంటూ): కృతజ్ఞతలు. మీ పెళ్ళిరోజెప్పుడో చెప్పండి, నేనూ మీకో బహుమానం ఇస్తాను.

# నలుగురు మిత్రుల కథ

*సేకరణ, పున: కథనం: V.విష్ణు (10 వ తరగతి), S.చంద్రకళ, S.ఆంజనేయులు, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి.*




అనగా అనగా ఒక ఊళ్లో ఒక మిరపకాయ, ఐస్క్రీమ్, ఉల్లిగడ్డ, టమోటా చాలా స్నేహంగా ఉండేవి.

ఒకసారి అవన్నీ కలిసి షికారుకు వెళ్దామని బయలుదేరాయి.

అవన్నీ పోతూ ఉంటే ఒక పెద్ద సముద్రం అడ్డు వచ్చింది.



నాలుగూ ఆ సముద్రంలోకి దూకి, ఈది, అవతలి ఒడ్డుకు చేరుకున్నాయి.

చూస్తే ఏముంది? ఐస్క్రీమ్ లేదు! అది సముద్రంలో కలిసిపోయింది!!

"అయ్యో! మన మంచి స్నేహితుడు ఐస్క్రీమ్ చనిపోయాడే" అని మిగిలిన మూడూ చాలా బాధపడ్డాయి.

బాధపడుతూనే అవి మూడూ మార్కెట్టు దగ్గరికి పోయాయి.

అక్కడ ఒకడు నిలబడి మిరపకాయలతో బజ్జీలు వేస్తున్నాడు.



అకస్మాత్తుగా అతను చేయెత్తి, మన మిరపకాయను తీసుకొని, పిండిలో ముంచి, నూనెలో వేసేశాడు!

"అయ్యో! మన మంచి స్నేహితుడు మిరపకాయ చనిపోయాడే!" అని మిగిలిన రెండూ బాధపడ్డాయి.



"ఇంకేం చేద్దాం?" అనుకొని, అవి రెండూ సినిమా చూసేందుకని వెళ్లాయి. టమోటా ఒక సీట్లోను, ఉల్లి గడ్డ ఒక సీట్లోను కూర్చున్నాయి.



అంతలో లావుపాటాయన ఒకాయన వచ్చి టమోటా మీదే కూర్చున్నాడు!

"అయ్యో! నాకున్న ఒక్కగానొక్క స్నేహితుడు టమోటా కూడా చచ్చిపోయాడే!" అని చాలా ఏడిచింది ఉల్లిగడ్డ.

"వీళ్ళు చనిపోతే నేనున్నాను గదా, ఏడ్చేందుకు? మరి నేను చనిపోతే ఎవరు ఏడుస్తారు?" అని దానికి ఇంకా ఏడుపు వచ్చింది.

అది అట్లా ఆపకుండా ఏడుస్తుంటే దేవుడికి దానిమీద జాలి వేసింది.



"నువ్వేమీ బాధ పడకు! నిన్ను కోసి చంపేవాళ్ళే ఏడుస్తారులే, నీకేమీ లోటుండదు" అన్నాడు దేవుడు, దాన్ని ఓదారుస్తూ.

అప్పటినుండీ ఉల్లిగడ్డను ఎవరు కోస్తున్నా, ఆ సమయంలో తప్పకుండా ఏడుస్తున్నారు.

# పాముల గాంధీ



*మూలం: బహురూపి గాంధీ, అను బంద్యోపాధ్యాయ, NCERT.*
*సంక్షిప్తానువాదం: నారాయణ, కొత్తపల్లి బృందం.*

పిల్లవాడుగా ఉన్నప్పుడు గాంధీకి పాములంటే చాలా భయం ఉండేది. చీకట్లోకి ఒంటరిగా పోవాలంటే కూడా భయం వేసేది. వాడి ఊహల్లో దొంగలు, భూతాలు, పాములు- ఇవన్నీ తనమీదికి దూకేందుకు సిద్ధంగా ఉన్నాయనిపించేది.

35 ఏళ్ల వయసు వచ్చేసరికి గాంధీ ఆశ్రమాలు స్థాపించటం మొదలు పెట్టాడు. ఆశ్రమం అంటే కేవలం ఒక గుడిసె కాదు- పెద్ద స్థలం, బావి, వ్యవసాయానికి తగినంత భూమి, పండ్లతోట- ఇవి కాక, చాలామంది నివసించేందుకు వేరు వేరు గుడిసెలు- ఉండేవి ఆశ్రమాల్లో. అవన్నీ నగరాల దుమ్మునుండి, రొద నుండీ దూరంగా, ప్రశాంతమైన వాతావరణంలో ఉండేవి. గాంధీ దగ్గర పెద్దగా డబ్బు ఉండేది కాదు- అందుకని కూడా ఆయన ఎవ్వరికీ ఇష్టం కాని బీడు భూముల్ని ఎంచుకొనేవాడు. ఆయన స్థాపించిన అన్ని ఆశ్రమాలూ-ఫోనిక్సు ఆశ్రమం, టాల్‌స్టాయ్ ఆశ్రమం, సబర్మతీ ఆశ్రమం, వార్ధా ఆశ్రమం, సేవాగ్రాం- ఇవన్నీ పాములతో నిండి ఉండేవి! ఆశ్రమాల్లో గుడిసెల నిర్మాణం జరిగేంతవరకూ అందరూ గుడారాలు వేసుకొని ఉండేవాళ్ళు- పిల్ల పాపలు ఉంటారు గనక, ఈ పాముల బెడదతో చాలా భయం వేసేది.

ఒక రోజున పైకప్పుకు వేళ్ళాడుతూ విషపు పాము దొరికేది. ఒక రోజున సైకిళ్ళ దగ్గరే చుట్టలు చుట్టుకున్న పాములు కనబడేవి. ఒక్కోసారి అవి పడక గదుల్లోకి కూడా చొరబడేవి!

గాంధీ అహింసను నమ్మేవాడు. తనకు, భార్యకు, కొడుక్కు రోగాలతో ప్రాణం మీదికి వచ్చినా సరే, ఆయన మాంసం వాడలేదు.

మాంసం నుండి, చేపలనుండీ తీసిన మందుల్నికూడా వాడనన్నాడు. ఆవుల్ని, బర్రెల్ని పీడించి పీడించి సేకరించే పాలు తనకు వద్దని, వాటి పాలు కూడా వాడటం మానేశాడు. అలాంటివాడు ఇక పాముల్ని ఎలా చంపుతాడు?

విషపు పాముల్ని కూడా చంపటానికి వీలు లేదని సాధారణ నియమం ఉండేది. త్రాళ్ళతో ఒక సాధనాన్ని తయారు చేశాడు గాంధీ- దానితో దూరం నుండే పాముల్ని పట్టుకోవచ్చు- ఆపైన వాటిని దూరంగా ఎక్కడైనా వదిలేసి రావచ్చు. అయితే మరి, పాములు అట్లా పట్టుకోడానికి అనువుగా లేని చోట్లలో కనబడితే ఎలాగ? పోనీ, వీలుగానే ఉన్నా, ఆ పని చేసేందుకు చేతులు రాకపోతే, భయం వేస్తే ఎలాగ? చివరికి గాంధీ ఓటమిని అంగీకరించాడు- "హింసను పూర్తిగా విడనాడటం దాదాపు అసాధ్యం. మనం కూరగాయలు కోసేటప్పుడు చెట్లకు కూడా బాధ కలుగుతుంది. ఎవరైనా పిల్లవాడు పాముకాటుతో చనిపోతే నేను తట్టుకోలేను. దానికంటే పాముల్ని చంపి పిల్లల్ని కాపాడటమే నయం. ఇప్పటికీ నాకు పాములంటే భయమే- ఇక నేను ఇతరులకు ఎలా చెప్పను? భయపడొద్దని?" అన్నాడు. "ఇతర మార్గాలన్నీ విఫలమైతే, అప్పుడు పామును చంపవచ్చు" అని అనుమతినిచ్చాడు చివరికి.



పాముల్ని గురించి నేర్చుకోవాలని గాంధీకి మహా ఉబలాటంగా ఉండేది. 'కాలెన్‌బాచ్' అనే జంతు శాస్త్రజ్ఞుడి సాయంతో విషపు పాముల్ని ఎలా గుర్తించాలో నేర్చుకున్నాడు గాంధీ. ఇంకా బాగా, 'ప్రాక్టికల్‌గా' నేర్చుకునేందుకు, కాలెన్ బాచ్ ఒక నాగు పామును పట్టుకొని, దాన్ని ఒక బోనులో పెట్టాడు. దానికి తనే స్వయంగా

రోజూ ఆహారం పెట్టేవాడు. ఆశ్రమంలో ఉండే పిల్లలు అందరూ దాన్ని చూసేందుకు ఎగబడేవాళ్ళు. ఎవ్వరూ దాన్ని పీడించేవాళ్ళు కాదు. అయినా గాంధీకి అది నచ్చలేదు. "దాని అలవాట్లు, పద్ధతులు తెలుసుకోవాలని మనం దాన్ని బంధించాం. అయితే మనం దాని పట్ల చూపిస్తున్న స్నేహభావం దానికి అర్థం అయి ఉండదు. దానితో ఆడుకునేంత ధైర్యం నీకూ లేదు; నాకూ లేదు. నీ స్నేహభావం వెనుకనే దాక్కుని ఉన్నది భయం. ఆ నాగుపామును మచ్చిక చూసుకుందామనుకోవటంలో దానిపట్ల ప్రేమ ఏమీ లేదు" అన్నాడు గాంధీ, కాలెన్ బాచ్ తో. ఆ సంగతి నాగుపాముకూ తెలిసినట్లుంది- అది ఒక రోజు బోనులోంచి తప్పించుకొని ఎటో పోయింది.

ఆశ్రమంలో ఉండే జర్మనీ దేశస్తుడొకడు పాముల్ని బాగా పట్టుకునేవాడు. పాములంటే అతనికి అసలు భయమే ఉండేది కాదు. చిన్న-పెద్ద పాముల్ని పట్టుకొని, వాటిని అతను తన అరచేతులమీద వేసుకొని ఆడించేవాడు. అంతటి ధైర్యంతెచ్చుకోవాలని గాంధీ మహా ప్రయత్నం చేసేవాడు. తను ముట్టుకోగానే, ఆ స్పర్శతోటే పాము "ఓహో! ఇతను నన్నేమీ చెయ్యడు" అని అనుకోవాలని ఆయనకు గొప్పకోరికగా ఉండేది. రామనామం జపించుకుంటూ విషపు పాము నోట్లో చెయ్యి పెట్టేంత ధైర్యం తెచ్చుకోవాలని ఉండేది గాంధీకి. కానీ తన చివరి రోజుల వరకూ కూడా ఆయన సొంతగా పాముల్నీ, తేళ్ళనీ పట్టుకోలేక-పోయాడు- అయితే ఆ విషయమై ఆయన సిగ్గు పడేవాడు చాలా సార్లు.

ఒకసారి నాయకులు కొందరు ఆయనతో ఏవో ముఖ్య విషయాలు చర్చించేందుకు వెళ్ళి, అందరూ ఒక్కసారిగా ఉలిక్కి పడ్డారు. కారణం- లోపల, గదిలో గాంధీ కూర్చొని ఒక పాముల వాడితో మాట్లాడుతున్నాడు. గాంధీ మెడను చుట్టుకొని ఉన్నది, ఒక పాము! గాంధీ వీళ్ళ రాకను గమనించనే లేదు- పాములవాడి మీదనే మనసంతా పెట్టాడు మరి! అప్పటికి గాంధీకి డెబ్భై ఏళ్ళు. ఆ వయస్సులో ఆయన పాములవాడికి శిష్యరికం చేస్తానని ముచ్చట పడుతున్నాడు. 'పాములు పట్టటమూ,

పాము కాటుకు వైద్యం చెయ్యటమూ' నేర్చుకుంటాడట! ప్రయోగం చేసేందుకు, 'ఎవరైనా ఒక మనిషి పాము చేత కాటు వేయించుకోవాలం'టున్నాడు పాములవాడు. "ఎవరో ఎందుకు? నేను సిద్ధం" అని తయారౌతున్నాడు గాంధీ!!

నాయకులంతా కలిసి ఎంతో నచ్చజెప్పాక, చివరికి గాంధీ ఆ ఆలోచనను విరమించాడు. అలా డెబ్భై ఏళ్ల గాంధీతాత పాముల వాడికి శిష్యుడయ్యే బంగారు అవకాశాన్ని కోల్పోయాడు, పాపం!

**పొడుపు కథలు**

1. పచ్చని టోపీ
   ఎర్రని శాలువ
   కడుపులో ఉన్నాయి ముత్యాలు
   ఏమిటది?

2. సీతమ్మ చీర
   ఎంత ఆరేసినా ఆరదు.
   ఏమిటది?

*జవాబు1: మిరపపండు.*

*జవాబు2: నాలుక.*

# పరిశుభ్ర గాంధీ



*మూలం: బహురూపి గాంధీ, అను బంద్యోపాధ్యాయ, NCERT.*
*సంక్షిప్తానువాదం: నారాయణ, కొత్తపల్లి బృందం.*

మోహన్‌దాస్ గాంధీ వాళ్ల నాన్న రాజ్‌కోట సంస్థానానికి ప్రధానమంత్రి. వాళ్ల ఇంట్లో "ఉకా" అనే అతను పాకీ పని చేసేవాడు.

ఆ రోజుల్లో ఇప్పుడున్నట్లు "సెప్టిక్ లెట్రిన్లు" ఉండేవి కావు. డబ్బులున్నవాళ్ల ఇళ్లలో మరుగుదొడ్లు ఉండేవి; కానీ అవి చాలా వేరేగా ఉండేవి. టాయిలెట్ గదిలో చిన్న పాటి పిట్ట గోడ ఒకటి కట్టి ఉండేది- గోడవారగా. గోడకు, ఈ పిట్ట గోడకు మధ్య మట్టి వేసి ఉంచేవాళ్ళు. దొడ్డికి పోయేవాళ్ళు పిట్టగోడ మీద ఎక్కి కూర్చుంటే దొడ్డి అంతా వెనకనున్న మట్టి మీద పడేది. వాళ్ళు పని ముగించుకున్నాక, ఆ దొడ్డిమీద కొంచెం సున్నం, మట్టి చల్లిపోయేవాళ్ళు. ప్రతిరోజూ పాకీ పనివాళ్ళు వచ్చి, ఆ దొడ్డినంతా తమ పారలతో తాము తెచ్చుకున్న బుట్టల్లోకెత్తుకొని, తలమీద పెట్టుకొని తీసుకెళ్ళి దూరంగా పారేసేవాళ్ళు.

ఈ పాకీవాళ్ళు అంటరాని వాళ్ళు- ఇళ్లలోకి రాకూడదట, వాళ్ళు! అందుకని, వాళ్ళు వచ్చి పోయేందుకు వీలుగా, ఇళ్ళకు వెనకవైపున ఒక తలుపు ఉండేది. అలా పాకీవాళ్ళు నేరుగా టాయిలెట్లోకి వెళ్ళి, దొడ్డి నిండిన తట్టలు నెత్తిన పెట్టుకొని పోయేవాళ్ళు.

గాంధీ ఎప్పుడైనా ఉకాను ముట్టుకుంటే 'మైల' పడ్డట్లు లెక్క. అప్పుడు వాళ్ళమ్మ పుతలీబాయి వాడిని స్నానం చెయ్యమనేది- ఆ మైల పోయేందుకు. మామూలుగానైతే గాంధీ తల్లిదండ్రుల మాటలు చక్కగా వినేవాడు; చాలా విధేయుడుగా కూడా ఉండేవాడు. కానీ ఈ మైలపడటం, స్నానం చెయ్యటం మాత్రం వాడికి అస్సలు ఇష్టం అయ్యేవి కావు.

పన్నెండేళ్ల వయస్సులో వాడు తల్లితో

వాదించేవాడు- "ఉకా మన పని చేసిపెడుతున్నాడు కదా? మన దొడ్డిని ఎత్తి పడేస్తున్నాడు. మనకు అంత సాయం చేస్తున్న మనిషిని ముట్టుకుంటే అంత నష్టం ఎందుకౌతుంది? ముట్టుకుంటే మైల పడేంత పాపపు పనా, అది? నేను నువ్వు చెప్పినట్లే స్నానం చేస్తాను- కానీ రామాయణం గుర్తు చేస్తానొకసారి- పడవ నడిపే గుహుడిని రాముడు కౌగిలించుకున్నాడు గదా? అప్పుడు తను మైల పడతానని ఆలోచించలేదు కదా! రామాయణం తప్పుగా ఎందుకు చెబుతుంది?" అని. పుతలీబాయి దీనికి జవాబు చెప్పలేకపోయేది.

గాంధీ పెద్దయ్యాక, దక్షిణాఫ్రికాలో బారిస్టరు పనిచేస్తూ, పాకీపని చెయ్యటం నేర్చుకున్నాడు. గాంధీ స్నేహితులు అతన్ని ఆ రోజుల్లో ప్రేమగా "అతి గొప్ప పాకీవాడు" అని పిలుచుకునేవాళ్ళు. అక్కడ మూడు సంవత్సరాలుండి, శలవు మీద ఒకసారి భారతదేశానికి వచ్చాడు గాంధీ.

సరిగ్గా అదే సమయానికి బొంబాయిలో ప్లేగువ్యాధి ప్రబలింది. ఊళ్ళకు ఊళ్ళు ఖాళీ అయిపోసాగాయి. వ్యాధి రాజకోటకు కూడా ప్రాకే అవకాశం ఉన్నది. శలవుమీద వచ్చిన గాంధీ రాజకోటలో ఇల్లిల్లూ తిరిగి చూడటం మొదలు పెట్టాడు. ప్రతి ఇంట్లోనూ దొడ్డి గుంటలుండేవి- మురిగిపోయి, కంపు కొడుతూ, చీకటి కూపాలలాగా. కొందరు ధనిక అగ్ర వర్ణాల వాళ్ళు అయితే, వీధి కాలవల్లోనే దొడ్డికి పోయేవాళ్ళు. ప్రధానమంత్రి కొడుకు, విదేశంలో లాయరుగా పనిచేస్తున్నవాడు- వచ్చి ఇంటింటా తిరిగి దొడ్డిని పరీక్షించటం, ఆరోజుల్లో వింతగానే ఉండేది. "దొడ్డి, మూత్రం రెండిటినీ వేరు వేరుగా ఉంచేందుకు ప్రయత్నించాలి. వీటికోసం మట్టివేసిన బక్కెట్లు రెండింటిని వేరువేరుగా వాడాలి" అని ఇల్లిల్లూ తిరిగి చెప్పాడు గాంధీ.

దక్షిణాఫ్రికానుండి భారతదేశానికి రెండోసారి వచ్చినప్పుడు, గాంధీ 'భారత జాతీయ కాంగ్రెస్' జాతీయ సమావేశాలకోసం కలకత్తా వెళ్ళాడు. 'విదేశాల్లో మగ్గుతున్న భారతీయుల కష్టాల' గురించి ఆయన అక్కడ మాట్లాడాల్సి ఉన్నది.

అయితే అతను అక్కడికి వెళ్ళేసరికి ఇతర నేతలు మాట్లాడుతున్నారు, వేదిక మీద. తన ఉపన్యాసానికి ఇంకా చాలా సమయం ఉన్నది.



ఊరికే అటూ ఇటూ తిరుగుతున్న గాంధీకి అక్కడి పరిసరాలు 'చాలా ఘోరం' అనిపించాయి. ఎక్కడ పడితే అక్కడ దొడ్డి, బురద, మురికి- పడి ఉన్నాయి. సభల్లో పాల్గొంటున్న ప్రతినిధులు కొందరైతే, ఏకంగా తమకు కేటాయించిన గదుల ముందే దొడ్డికి పోయి ఉన్నారు!

అక్కడ 'స్వచ్ఛంద సేవకులు' అని బ్యాడ్జీలు పెట్టుకొని తిరిగేవాళ్లను 'పరిశుభ్రత సంగతేమిటి?' అని అడిగాడు గాంధీ. "అది పాకీవాళ్ల పని- మాదికాదు" అన్నారు వాళ్ళు!!

గాంధీ ఊరికే ఉండలేకపోయాడు. ఎవరినో అడిగి, తనే స్వయంగా చీపురు పట్టుకొన్నాడు. అక్కడి దొడ్డిలన్నిటినీ శుభ్రం చేసి, తట్టలోకి ఎత్తి, దూరంగా పొయ్యటం మొదలు పెట్టాడు. ఆ సమయానికి అతను విదేశీయుల మాదిరి, సూటూ, బూటూ, హ్యాటూపెట్టుకొని ఉన్నాడు. అక్కడున్న స్వచ్ఛందసేవకులంతా ఒక ప్రక్కకు చేరి, ఆశ్చర్యపోతూ చూశారు తప్పిస్తే, ఒక్కరు కూడా "మేమూ చేస్తాం" అని ముందుకు రాలేదు.

చాలా సంవత్సరాల తర్వాత, గాంధీని 'భారత జాతీయోద్యమానికి కాంతిరేఖ' గా అందరూ గుర్తించిన తర్వాత, ప్రతి కాంగ్రెస్ సభలోనూ పాకీ పని కోసం "భంగీ స్క్వాడ్‌లు"-"పాకీ బృందాలు" ఏర్పడ్డాయి. కొంతకాలం పాటు ఆ భంగీ స్క్వాడ్ లలో కేవలం బ్రాహ్మణులే ఉండేవాళ్ళు!

సెప్టిక్ లెట్రిన్‌లు వచ్చినా, ఇంకా కొన్ని చోట్ల పాకీ పని రివాజుగా కొనసాగుతూనే వచ్చింది, చాలాకాలం వరకూ. చివరికి స్వతంత్ర భారత ప్రభుత్వం చట్టం చేసి, పాకీ పనిని నిషేధించింది. ఇప్పుడిక ఎవ్వరూ దొడ్డిని నెత్తికెక్కించుకోవలసిన అవసరం లేదు.

**పీకాకు!** **జోకులు**

బడి ఎలాగుందో చూసేందుకు పరీక్షకులవారు వచ్చారు. పిల్లల్ని ప్రశ్నలు అడుగుతున్నారు.

పరీక్ష: బాబూ నెమలిని ఇంగ్లీషులో ఏమంటారో చెప్పు!

పిల్లలెవ్వరూ మాట్లాడలేదు.

టీచరుగారికి ఉత్కంఠ పెరిగిపోతున్నది. ఎవ్వరూ చెప్పక పోతే పరువు చేటు. ఎలా?

అప్పటికప్పుడు ఓ ఆలోచన తట్టింది. ఓ పిల్లవాడి దగ్గరికి వెళ్ళి, పరీక్షకుడు చూడకుండా జుట్టు పట్టుకొని గట్టిగా పీకాడు.

పిల్లవాడు అరిచాడు: పీకాకు సార్! పీకాకు (పీకవాకు) సార్!! అని.

పరీక్ష: (అటువైపు తిరిగి ) కరెక్టు! అన్నారు.

టీచరుగారు గట్టిగా గాలి పీల్చుకున్నారు.

**గడియారం తప్పు!**

టీచరు: రాముా! పది, పదకొండు, పన్నెండు- తరవాత ఎంతొస్తుంది?

రాము: ఒకటి వస్తుంది టీచర్!

టీచరు: తప్పు. పన్నెండు తర్వాత వచ్చేది పదమూడు గదరా?

రాము: లేదు టీచర్! మా ఇంట్లో గడియారంలో పన్నెండు తరువాత వచ్చేది ఒకటే!

*( సేకరణ: శ్రీ పుల్లయ్య, ఉపాధ్యాయులు, గడ్డం నాగేపల్లి, అనంతపురం జిల్లా)*

# వంట పని గాంధీ



*మూలం: బహురూపి గాంధీ, అను బంద్యోపాధ్యాయ, NCERT.*
*సంక్షిప్తానువాదం: నారాయణ, కొత్తపల్లి బృందం.*

బారిస్టరు చదువుకోసం ఇంగ్లాండు వెళ్ళేసరికి గాంధీకి 18 ఏళ్ళు. ఆయన పూర్తిగా శాకాహారి- మాంసం అస్సలు తినేవాడు కాదు. అయితే ఆ రోజుల్లో ఇంగ్లాండులో శాకాహారులంటూ చాలా తక్కువమంది మాత్రమే ఉండేవాళ్ళు. వాళ్ళు తమకోసం ప్రత్యేకంగా కొన్ని హోటళ్ళు పెట్టుకున్నారు. ఆ హోటళ్లవాళ్ళు గాంధీకి బ్రెడ్డు, వెన్న, జాం, ఉడకబెట్టిన కూరముక్కలు ఇచ్చేవాళ్ళు. ఆ కూరముక్కలపైన తిరగమోత కూడా ఉండేది కాదు. తల్లి చేతివంటకు అలవాటు పడ్డ గాంధీకి ఆ చప్పిడి తిండి అస్సలు రుచించేది కాదు.

ఇట్లా శాకాహార హోటళ్లలో కొన్ని నెలలపాటు తిన్న తరువాత, 'ఖర్చు తగ్గించుకోవాలి' అనిపించింది గాంధీకి. గది అద్దెకు తీసుకొని, స్టౌ మీద సొంతగా వండుకొని తినటం మొదలు పెట్టాడు. రోజూ ఇరవై నిముషాల్లో వంట ముగించేవాడు. వంట లెక్కలు ప్రత్యేకంగా రాసి పెట్టుకునేవాడు. భోజనం కోసం రోజుకు ఒక రూపాయి ఖర్చయ్యేదట.

లండన్ శాకాహార సమాజం వారితో పరిచయం పెరిగాక, 'శాకాహారమే ఎందుకు తినాలి, మాంసం ఎందుకు తినకూడదు?' అని రాసిన పుస్తకాలు చదివాడు గాంధీ. ఆపైన ఆయన తన వంటల్లో చాలా ప్రయోగాలు చేశాడు; చాలా మార్పులు తెచ్చుకున్నాడు.

గాంధీ ఆశ్రమాల్లో ఎక్కడా ప్రత్యేకంగా వంటవాళ్లను జీతాలిచ్చి పెట్టుకోలేదు. "ఒక్క భోజనంలో అన్ని రకాల వంటలెందుకు? సమయం వృధా" అని, గాంధీ వంటపనిని మొత్తాన్నీ సరళం చేసేందుకు ప్రయత్నించాడు. "ఆశ్రమంలో పదిమందికీ పది రుచులు

కుదరదు" అని, అందరికీ ఒకే రకం వంట ఉండే ఏర్పాట్లు చేశాడు. అందరికీ వంట ఒకేచోట. అందరూ కలిసి తినాలి.

'జోనాథన్ జస్టు' అనే ఆయన రాసిన పుస్తకం "ప్రకృతిలోకి మళ్ళీ.." చదివాక, గాంధీకి అనిపించింది- "రుచికోసం కాదు; శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచేందుకు తినాలి" అని. అటు తర్వాత ఆయన భోజనం పరంగా చాలా ప్రయోగాలు చేశాడు. ఒకసారి ఐదేళ్ళపాటు కేవలం పండ్లు తిని బ్రతికాడు. ఒకసారి నాలుగు నెలలపాటు కేవలం మొలకెత్తిన విత్తనాలు, పచ్చి కాయగూరలు తిని, నీళ్ల విరేచనాలు తెచ్చుకున్నాడు!



దక్షిణాఫ్రికాలో గాంధీ ఆశ్రమంనుండి సత్యాగ్రహులు జట్లు జట్లుగా వెళ్ళి నిరసన వ్యక్తం చేసి, పోలీసుల చేత దెబ్బలు తినేవాళ్ళు. అలా జట్టు బయలుదేరిన ప్రతిసారీ, వాళ్లకు స్వయంగా తన చేతుల్తో కాల్చిన రొట్టెలు, టమేటా పచ్చడి, అన్నం, కూర, ఖర్జూరాలు పెట్టేవాడు గాంధీ. ఒకవైపున ఆయన చేతులు చకచకా వంట పని చేస్తుంటే, అయన నోరు మాత్రం వాళ్లకు 'సత్యాగ్రహి జీవితం ఎట్లా ఉండాలి, జైల్లో ఎట్లా జీవించాలి'-అని పాఠాలు చెబుతుండేది.

ఆ సందర్భంలో, ఒకసారి 2500 మంది సత్యాగ్రహులున్నప్పుడు, పప్పులో నీళ్ళు ఎక్కువైపోయాయి. ఇంకో రోజున అన్నం సరిగ్గా ఉడకనే లేదు- అయినా, పాపం, ఆ సత్యాగ్రహులు గాంధీ మీది గౌరవం కొద్దీ ఏమీ అనకుండా తినేశారు!

'వంటపని నేర్వటం' అనేది 'విద్య'లో అతి ముఖ్యమైన అంశం అని గాంధీకి నమ్మకం. తన 'టాల్‌స్టాయ్ పొలం లో ఉన్న అందరు పిల్లలకూ వంట చెయ్యటం వచ్చు' అని చాలా గర్వంగా

చెప్పుకునేవాడు. భారతదేశానికి రాగానే, తన ఈ పిచ్చిని శాంతి నికేతన్‌లో ఉన్న పిల్లలకు కూడా అంటించాడు గాంధీ. వాళ్ళు కూడా, వెంటనే ఓ "సాముహిక వంటశాల" కట్టుకొని, వంతుల వారీగా వంట చేయటం మొదలు పెట్టారు!

మద్రాసులోని ఒక హాస్టలులో వేరువేరు కులాల పిల్లలకు వేరు వేరు వంటగదులుండటం చూసి, గాంధీ చలించి పోయాడు. అవి పిల్లలకు వేర్వేరు రుచుల్లో వడ్డిస్తాయని వాళ్ళు వివరించారు గాంధీకి. అదే సమయంలో ఒక బెంగాలీ ధనికుడు గాంధీ కోసం పెద్ద విందొకటి ఏర్పాటు చేశాడు. ఆ విందులో లెక్కలేనన్ని వంటకాల్ని చూశాక, గాంధీకి వెగటు వేసింది. ఆనాటినుండీ గాంధీ 'ఐదుదినుసుల నియమం' ఒకటి పెట్టుకున్నాడు: "తను ఏ పూటనైనా తినే భోజనంలో ఏవైనా సరే-కేవలం ఐదు దినుసుల్నే వాడాలి" అని.

గాంధీ తినే ఆహారంలో చిత్రాలు చాలానే ఉండేవి. ఒక్కోసారి వేప చిగుర్ల చట్నీ ఉండేది- ఘోరమైన చేదుగా! నూనె మిల్లు లోంచి వచ్చిన తాజా చెక్కకు పెరుగు కలిపి తినటం, చింతపండుకు బెల్లం కలిపి చేసిన షర్బత్, ఉడికించి నలిపిన సోయా చిక్కుడు గింజలు (ఎలాంటి తిరగమోతా లేకుండా), ఎండిపోయిన చపాతీలను మెత్తగా పిండిచేసి తయారుచేసిన పాయసం, వేయించిన గోధుమల పొడితో చేసిన కాఫీ- ఇవి ఆ వరసలో కొన్ని వింతలే.

గాంధీకి వంటకాలపైన మక్కువ చాలా ఉండేది- ఒకసారి ఇంగ్లాండుకు పడవలో ప్రయాణిస్తూ ఆయన తన మేనల్లుడికి ఉత్తరం రాశాడు- "రెండువంతుల అరటిపండ్ల పొడికి, ఒక వంతు గోధుమ పిండి కలిపి, మేం బిస్కెట్లు, రొట్టెలు చేస్తాం" అని!

గాంధీకి కేకులు చేయటం కూడా వచ్చు. అన్నం, పప్పు, కూర, చారు, సలాడ్లు; కమలాపండ్లతోటీ-వాటి తొక్కులతోటీ పానీయాలు; యీస్టునుగాని, బేకింగ్ పౌడరును గాని వాడకుండా బ్రెడ్ చెయ్యటం- ఇవన్నీ బాగా వచ్చు. గాంధీ ఆశ్రమాలన్నింటిలోనూ బ్రెడ్లు, బిస్కెట్లు

చేయటాన్ని ఆయనే స్వయంగా నేర్పాడు.

గాంధీ అనుచరుడొకడన్నాడు:"మామూలు గడ్డిలో చాలా ప్రత్యేకమైన విటమిన్లు, పోషక విలువలు ఉన్నాయని ఈ మధ్యే వెలుగులోకి వచ్చింది. నిజంగా ఇది మా అదృష్టం- ఈ సంగతి తెలిసేటప్పటికి గాంధీ గారు ఆశ్రమంలో లేరు. లేకపోతే ఆయన తక్షణమే వంటగదిని మూయించేసి, మా అందరిచేతా ఆశ్రమం బయట గడ్డి మేయించేవాడు" అని!

దీన్ని బట్టి గాంధీ ఎంత గొప్ప వంటవాడో అర్థం అవుతున్నది, కదూ?

జోకులు

**ఏమనాలి?**

పిచ్చి ప్రశ్న: వాడు విమానం ఎక్కి ఎందుకు చదువుకున్నాడు?

పిచ్చి జవాబు: ఉన్నత విద్య కావాలని!

**అసలుకు మోసం!**

రామారావు విచారంగా ఉన్నాడు.

సుబ్బారావు: ఏంటి రామారావూ, విచారంగా ఉన్నావు?

రామారావు: ఏమీ లేదురా, మా దుకాణంలో డబ్బులు లెక్కపెట్టే కొత్త గుమాస్తా కోసం వెతుకుతున్నాను.

సుబ్బారావు: అదేంటిరా, మొన్ననే గదా, కొత్త గుమాస్తాను చేర్చుకున్నావు?

రామారావు: నేను వెతుకుతున్నది వాడికోసమేరా! వాడూ లేడు, నా డబ్బులూ లేవు!

# చాకలి గాంధీ



*మూలం: బహురూపిగాంధీ, అను బంద్యోపాధ్యాయ, NCERT.*
*సంక్షిప్తానువాదం: నారాయణ, కొత్తపల్లి బృందం.*

బారిస్టరు గాంధీ కోర్టుకు వెళ్ళేటప్పుడు మిగిలిన యూరోపియన్‌ల మాదిరి సూటూ, బూటూ, హ్యాటూ, లోపల ఒక చొక్కా, చొక్కాకు విడిగా ఒక కాలరు, మెడకొక టై- ఇవన్నీ వేసుకునేవాడు. ప్రతిరోజూ చొక్కాకు మ్యాచ్ అయ్యేట్లు కొత్త కాలర్ కావలసి వచ్చేది. చొక్కాని రోజువదిలి రోజు మార్చేవాడు- దాంతోబాటే మిగతావన్నీ మార్చాల్సి వచ్చేది. ఇక ఆ బట్టలన్నింటినీ ఉతికేందుకు చాలా ఖర్చు అయ్యేది- బట్టలుతికే ఖర్చు ఎక్కువౌతున్నదని చింత పట్టుకున్నది గాంధీకి.

ఇలా రెండురోజులకొకసారి బట్టలు మార్చి, ఉతికేందుకు వేస్తే, అక్కడి చాకలివాళ్ళు వాటిని అంత తొందరగా వెనక్కి ఇచ్చేవాళ్ళు కాదు. వాళ్ళు సర్వ స్వతంత్రులు! అంతా వాళ్ల దయ! అందుకని, మంచి మంచి బట్టలు ఎక్కువమొత్తంలో ముందుగా జమచేసుకొని పెట్టుకుంటే తప్ప, గాంధీ అవసరానికి బట్టలు అందేవి కాదు. చివరికి, ముప్ఫై ఆరు జతల బట్టలున్నా గాంధీకి సరిపోలేదు!

బట్టల ఖర్చు తడిసి మోపెడయ్యాక, 'ఇక ఖర్చులు తగ్గించాల్సిందే' అని నిశ్చయించుకున్నాడు గాంధీ. కానీ ఎలా? తనకేమో బట్టలు ఉతుక్కోవటం రాదు- ప్రధానమంత్రి కొడుకాయె! చివరికి, ఇక తప్పదన్నట్లు, తన బట్టలు తాను ఉతుక్కునేందుకు అవసరమయ్యే సామగ్రినంతా కొని తెచ్చుకున్నాడు . బట్టలు ఉతకటం గురించిన పుస్తకం ఒకటి కొనుక్కొచ్చుకుని, ముందు దాన్నంతా శ్రద్ధగా చదివాడు. ఒకసారి ఆ సూచనలన్నీ మనసుకెక్కాక, ఇక వాటిని అమలు చేసేందుకు

పూనుకున్నాడు. తన ప్రయోగాల్ని ఊరికే కూర్చొని చూసే అవకాశం ఇవ్వలేదు కస్తూర్బాకు- ఆమెకూ బట్టలు ఉతకటం నేర్పేశాడు! గాంధీకి అంటిన ఈ కొత్త పిచ్చి అతనికున్న ఇతర పనులమీద ఇంకొంచెం ఒత్తిడిని పెంచింది- కానీ ఓటమిని అంత తొందరగా అంగీకరించే రకం కాదు, గాంధీ- "అక్కడి చాకలివాళ్ల బల దర్పాన్ని తుంచి, తను ఎలాగైనా సరే, ఆత్మ నిర్భరుడు కావాలి" అనుకున్నాడు. ప్రయత్నం కొనసాగిస్తూ పోయాడు.

ఒక రోజున గాంధీ తన చొక్కా కాలరును ఉతికి, బాగా గంజి పెట్టుకున్నాడు. పని ఇంకా సరిగ్గా రాదు కదా, ఆ కాలరుకు గంజి ఎక్కువైంది. పైపెచ్చు, దాన్ని బాగా వేడెక్కిన ఇస్త్రీ పెట్టెతో ఇస్త్రీ చెయ్యటానికి బదులు, మామూలు వేడితో పని కానిచ్చేశాడు. "కొంచెం బలంగా ఒత్తితే చాలు" అనుకున్నాడు. "కాలిపోదూ, వేడి ఎక్కువైతే?" అనుకున్నాడు. ఇక అది గట్టిగా, అట్టలాగా, నీలుక్కొని, అలాగే నిల్చుండి పోయింది. మనవాడు దానినే వేసుకొని, గర్వంగా కోర్టుకు పోయాడు. తోటి లాయర్లందరూ పడి పడి నవ్వుతున్నా, గాంధీ మాత్రం చెక్కు చెదరలేదు. "ఏముంది? ఇది మొదటిసారి కదా, నేను సొంతగా ఉతుక్కున్నది?! అందుకని గంజి కాస్త ఎక్కువైనట్లుంది: కానీ ఏమీ పరవాలేదులే. కనీసం అది మిమ్మల్ని ఇంతగా నవ్వించింది- అంతేచాలు!" అన్నాడు తనూ నవ్వేస్తూ.

వాళ్లలో ఒకతను అడిగాడు- "ఇక్కడ ఇస్త్రీ షాపులకు అంత కొరత ఏమీ లేదే?!" అని. "లేదు. కానీ, బట్టలకయ్యే ఖర్చు ఎక్కువగానే ఉంటోంది. ఒక కాలరును ఉతికేందుకు అయ్యే ఖర్చుతో కొత్త కాలరునే కొనుక్కోవచ్చు! అంతేగాక ఆ ఉతికేవాళ్ళమీద నిరంతరంగా ఆధారపడి బ్రతకటం ఉంది- దానికంటే సొంతంగా ఉతుక్కోవటమే మేలు!" అన్నాడు గాంధీ.

తర్వాతి కాలంలో గాంధీ గొప్ప చాకలివాడు అయ్యాడు. బట్టలు ఉతికే కళలో నిష్ణాతుడయ్యాడు.

గాంధీకి గోఖలే అంటే గురుభావం ఉండేది.

ఒకసారి గోఖలే వచ్చాడు, గాంధీ వాళ్ళ ఇంటికి. ఆరోజున గోఖలే ఏదో పెద్ద సభకు వెళ్ళ వలసి ఉన్నది. ఆయన మెడకు కట్టుకున్న గుడ్డ బాగా నలిగిపోయి ఉన్నది; కానీ దాన్ని ఉతికించుకునేందుకు సమయం చాలదు. గాంధీకి అవకాశం దొరికింది- "నేను దాన్ని చక్కగా ఇస్త్రీ చేసిపెట్టనా?" అని అడిగాడు గురువుగారిని.

"లాయరుగా నీ శక్తి సామర్ధ్యాలమీద నాకు నమ్మకం ఉంది. కానీ చాకలివాడుగా అస్సలు నమ్మలేను. దాన్ని నువ్వు పాడు చేయవని ఎలా నమ్మేది?" అన్నాడు గోఖలే. కానీ గాంధీ పట్టిన పట్టు వదలక, గురువుగారిని పీడించి మరీ దాన్ని ఇస్త్రీ చేశాడు. గోఖలేకు గాంధీ పనితనం నచ్చింది కూడా! ఆయన గాంధీని మెచ్చుకునేసరికి, "నాకు ఈ ప్రశంస చాలు- ఇక ఈ ప్రపంచంలో ఎవ్వరినుండీ నాకు ఎలాంటి సర్టిఫికేటూ అవసరం లేదు" అని సంబరపడ్డాడు గాంధీ.

దక్షిణాఫ్రికాలో గాంధీ ఆశ్రమంలో నీళ్ల సమస్య ఉండేది. ఆడవాళ్ళు దూరంగా ఉండే వంకకు వెళ్ళి, బట్టలు ఉతుక్కొని వచ్చేవాళ్ళు. ఆ పనిలో గాంధీ వాళ్ళకు సాయపడేవాడు. ఆరోజుల్లోనే కొత్తగా ఆశ్రమంలో ముతక ఖాదీ బట్టలు నేయటం మొదలుపెట్టారు- ఆడవాళ్ళు ఆ చీరల్ని కట్టుకునేందుకైతే ఇష్టపడేవాళ్ళు; కానీ ఉతుక్కోవటం దగ్గరికి వచ్చేసరికి సణిగేవాళ్ళు. అప్పుడు ఇక గాంధీ కొంత కాలం పాటు పూర్తిస్థాయి చాకలివాడుగా తన సేవలందించాడు.



గాంధీ ఇతరుల బట్టలు ఉతికేందుకు ఏమీ సిగ్గుపడేవాడు కాదు. ఒకసారి ఆయన ఎవరో ఒక ధనికుడి ఇంటికి అతిథిగా వెళ్ళాడు. స్నానం చేసేందుకని స్నానాల గదిలోకి వెళ్ళిన గాంధీకి, అక్కడొక చక్కని పంచె, నేలమీద పడి

కనిపించింది. స్నానం చేశాక, ఆయన తన బట్టలతోబాటు ఆ పంచెను కూడా ఉతికాడు. ఆపైన వాటిని ఆరేసేందుకు ఎండలోకి పోయాడు- "తెల్ల బట్టల్ని ఎంతమంచి ఎండలో ఆరేస్తే అంత మంచిది- అవి అంత తెల్లగా మెరుస్తాయి; వాటిలోని క్రిములూ నశిస్తాయి" అనేవాడు గాంధీ. బట్టలు ఆరేస్తున్న గాంధీని చూసి ధనికుడు పరుగెత్తుకొచ్చాడు- "ఏంటిది, బాపూ!" అని నొచ్చుకుంటూ.

"తప్పేముంది? క్రింద పడ్డాక, పంచెకు మురికి అంటి ఉంటుంది. అందుకని నేను దాన్ని ఉతికి ఆరేస్తున్నాను. మనం వాడే వస్తువుల్ని పరిశుభ్రంగా ఉంచుకునేందుకు సిగ్గేల?" అన్నాడు చాకలి గాంధీ, చిరునవ్వుతో.

జోకులు

**వినటం సమస్య!**

టీచరు(కోపంగా): రామూ! నేను చెబుతున్నది నువ్వసలు వినటం లేదు. నీకు వినికిడి సమస్య వస్తున్నట్లుంది!

రాము: లేదు మేడం! నాకు మీరు చెప్పేది వినటం సమస్యగా ఉంది అంతే.

**నేను మా నాన్నను!**

రాము (బడికి ఫోన్ చేసి): హెడ్మాస్టరుగారూ! మా అబ్బాయికి బాగా జలుబు చేసింది, ఈ రోజు బడికి రాడు.

హెడ్మాస్టరు: ఎవరండీ, మాట్లాడేది?

రాము: నేను మా నాన్నను మాట్లాడుతున్నాను.




# దుఃఖ వృక్షఫలం

*రచన: శ్రీమతి ఆదిలక్ష్మి, "అమ్మ ఒడి"*

మంగళ గిరి గ్రామంలో మాధవుడు అనే యువకుడు ఉండేవాడు. వాడు మంచివాడు, పట్టుదల గలవాడు. కానీ సిగ్గరి కావటంతో పెద్దగా ఎవరితోనూ మాట్లాడేవాడు కాదు. దాంతో అందరూ వాణ్ణి 'మందమతి' అనీ, 'ఆలోచించటం రాని వాడనీ' అనేవాళ్ళు.

రాను రాను ఆ మాటల్ని నమ్మేసిన మాధవుడు, నిజంగానే తాను అనాలోచనా పరుణ్ణనీ, అసమర్ధుణ్ణనీ అనుకోసాగాడు. అది చూసి వాడి తల్లి చాలా బాధ పడేది.

ఓసారి ఊరి నుండి వాడి మేనమామ వాళ్ళని చూడవచ్చాడు. మాధవుడి గురించి అన్నతో చెప్పుకొని వాపోయింది వాడి తల్లి. నాలుగురోజులు మాధవుణ్ణి బాగా పరిశీలించిన

మేనమామ, ఆమెకి భరోసా ఇచ్చాడు. ఆ రోజు సాయంత్రం మాధవుణ్ణి మాటల్లో పెట్టి, వాడి సామర్థ్యాన్ని పొగిడాడు.

మాధవుడు విచారంగా "నన్ను ఆటపట్టిస్తున్నావా మామయ్యా! నాకు ఆలోచించటమే రాదు. ఇంకేం సామర్థ్యం?" అన్నాడు.

మేనమామ వెంటనే "అయితే ఓ పందెం వేసుకుందాం. ఊరంతా వెదికి, దుఃఖ వృక్షం ఎక్కడుందో కనిపెట్టి, దానిని దేనికి ఉపయోస్తారో చెప్పు. ఆ పని నువ్వు చేస్తే నేను గెలిచినట్లు. అప్పుడు 'నువ్వు సమర్థుడివి' అన్న నా మాటని నువ్వు ఒప్పుకోవాలి. చెయ్యలేకపోతే నువ్వు గెలిచినట్లు. అప్పుడు 'నువ్వు అసమర్థుడివి' అనే నీ మాటని, నేను ఒప్పుకుంటాను" అన్నాడు.

మాధవుడు సరేనన్నాడు.

మర్నాడు ఊరంతా గాలించాడు. "దుఃఖ వృక్షం అంటే ఏమిటి, ఎక్కడుంది?" అని అందర్నీ అడిగాడు. అందరూ వాణ్ణి చూసి నవ్వినా పట్టుదల విడిచిపెట్టలేదు. ఎవర్నడిగినా ఏమీ తెలియక పోవటంతో, చెఱువు గట్టున కూర్చున్నాడు.

పక్కనే ఉన్న చింత చెట్టు క్రింద పిల్లలు గోళీలాడుకుంటున్నారు. ఒక్కసారిగా మాధవుడికి దుఃఖాన్ని 'చింత' అంటారని గుర్తుకొచ్చింది. గబగబా చెట్టెక్కి, పై కండువా నిండా చింత పండ్లు తెంపు కొచ్చి తల్లికిస్తూ "అమ్మా! వీటితో పులిహోర చెయ్యి" అన్నాడు.

రాత్రి భోజనాల వేళ, మేనమామ వాడితో "ఏరా అబ్బాయ్! నువ్వు ఓడిపోయినట్లే కదా! ఇప్పుడు ఒప్పుకుంటావా నా మాటే నిజమనీ, నువ్వు సమర్థుడివే, ఆలోచనా పరుడివేనని?" అన్నాడు కళ్ళెగరేస్తూ!

"నేను ఓడి గెలిచాను మామయ్యా!" అన్నాడు మాధవుడు నవ్వుతూ.

"ఓరి పిడుగా?" అన్నాడు మేనమామ సంతోషంగా!

# సమానత్వం

*మూలం: పర్తాప్ అగర్వాల్.*

*తెలుగు అనుసరణ: నారాయణ.*



గురు గోవింద సింగ్ నాయకత్వంలో సిఖ్ఖులు ఔరంగజేబు దుశ్చర్యలకు వ్యతిరేకంగా పోరాటం చేస్తున్న రోజులవి. సిఖ్ఖులకు, ఔరంగజేబు సైన్యాలకూ మధ్య ఘోరమైన యుద్ధం జరిగింది. గురుగోవింద సింగ్ కొద్ది మంది ముఖ్య అనుచరులతో కలిసి అతి కష్టం మీద కోటనుండి బయట పడ్డాడు. దాదాపు కోటంతా శత్రువుల పాలైంది. మొగల్ సైన్యాలు ఆనాడు విలయ తాండవం చేశాయి. అనేకమంది సిఖ్ఖు యోధులు ఆ ఒక్క రోజులో అమరులైనారు.

సిఖ్ఖు వీరుల కళేబరాలతో రణ భూమి నిండి ఉన్నది. పది ఉన్న ఆ శరీరాల మధ్యనుండి నడుస్తున్నాడు గురు గోవింద సింగ్. ఆయనకు పరిచయం ఉన్న ముఖాలు, ఆ శరీరాల మధ్య అనేకం కనబడ్డాయి. ఆయనకు ముందుగా దీపం పట్టుకొని నడుస్తున్నారు కొద్దిమంది అనుచరులు. అక్కడ పడి ఉన్న అసంఖ్యాక మృత కళేబరాలలో ఫతేసింగ్ శరీరాన్ని గుర్తించారు వాళ్ళు- ఫతే సింగ్ గురుగోవింద సింగ్ కొడుకు. అంత చిన్న వయస్సులోనే మృతి చెందాడు, గురు పుత్రుడు. వాళ్ళు అక్కడే నిలబడి, గురుగోవింద సింగ్ రాక కోసం వేచి చూశారు.

గురుగోవింద సింగ్ వాళ్లను చేరుకొన్నాక, ప్రక్కనే పడి ఉన్న ఫతే సింగ్ మృత శరీరాన్ని చూపారు వాళ్ళు. వాళ్లలో ఒకరు అన్నారు- " ఆ యువ యోధుడి సేవలకు, త్యాగానికి గుర్తుగా అతని శరీరాన్ని ప్రత్యేకంగా ఒక బట్టతో కప్పుదాం" అని. గురువుగారు ఆ మాటలు విన్నారు, కానీ ఏమీ అనకుండా అలాగే నిలబడ్డారు చాలా సేపు. ఆయన మనసులో ఏం

కదులుతున్నదోమరి- అందరూ ఆయన ఆజ్ఞకోసం ఎదురుచూస్తూ నిలబడ్డారు.

అప్పుడు అన్నాడాయన: "అవును. 'కళేబరాల్ని బట్టతోకప్పటం' అనేది చాలా మంచి ఆలోచన. అలాగే చేద్దాం- అయితే మనం ఈ వీరులందరి శరీరాలనూ కప్పాలి మరి- మీ దగ్గర ఎన్ని బట్టలున్నాయోచూడండి. అందరికీ సరిపోయేన్ని ఉంటే కప్పండి- నాకేమీ అభ్యంతరం లేదు. 'ఫతే నా కుమారుడు' అని అతని శరీరానికి ప్రత్యేకంగా మర్యాదలు చేయవలసిన అవసరం లేదు. సిఖ్ఖులందరూ నా కుటుంబ సభ్యులే. నేను నా ఫతే శరీరాన్ని కప్పి, మిగిలిన నావాళ్ల శరీరాల్ని కప్పకుండా ఎండకు-గాలికి వదిలెయ్యలేను" అని.

అనుచరులెవ్వరూ మాట్లాడలేదు. గోవింద సింగ్ కొనసాగించారు: "ఢిల్లీలో కూర్చొని రాజ్యాన్నేలే మొగల్ చక్రవర్తిని మనం ఎందుకు ఎదిరిస్తున్నాం? 'సమాన న్యాయం' కోసమే గదా? అలాంటప్పుడు, మనలో మనం ఆ సమానత్వాన్ని అమలు చెయ్యకపోతే ఎలాగ? ఈ పవిత్ర యుద్ధంలో పాల్గొనే వీర యోధులందరికీ సమాన గౌరవాన్నివ్వాలి. నా కొడుకు ఫతే కూడా ఒక సిఖ్ఖు కాదూ? అతన్ని వేరు చేసి చూడటం ఎందుకు? గుర్తుంచుకోండి- మనం అందరం ఆ పరమాత్ముని బిడ్డలమే. ప్రేమ, గౌరవాల్లో మనందరిదీ సమాన వాటానే."

అందరికీ సరిపోయేన్ని బట్టలు లేవు, వాళ్ల దగ్గర. అందుకని అక్కడ పడి ఉన్న శరీరాలన్నింటినీ కప్పకుండా అలాగే వదిలారు.

గురుగోవింద సింగ్ నుండి ఆనాడు నేర్చుకున్న సమానత్వపు నియమాన్ని ఆయన శిష్యులు ఇక ఏనాడూ మరచిపోలేదు.

**పొడుపు కథ**

మురికిగా ఉంటే తెల్లగాను,

శుభ్రంగా ఉంటే నల్లగాను- ఉంటాను నేను.

ఎవరిని నేను?

*జవాబు: బడిలో ఉండే నల్లబల్ల (బ్లాక్ బోర్డు)*

# మా ఇల్లు

రచన: G.లలిత, telugu4kids.com

అమ్మ అంటుంది కదా,

"మన ఇల్లొక అడవి!

పిల్లలు కోతులు,

కుర్చీలు, మంచాలు, చెట్లు ఎక్కినట్లు ఎక్కుతారు!"







నాన్న అంటారు,

"మన ఇల్లొక సినిమా హాలు!

పిల్లలు కథానాయకులు,

పెద్దలు ప్రేక్షకులు!"



మా స్నేహితులంటారు,
"మీ ఇల్లొక గ్రంథాలయం!
నిజంగానే,
మీ ఇంటి నిండా ఎన్ని పుస్తకాలు!"



మా నాయనమ్మ అంటుంది,
"మన ఇల్లు కావాలి ఒక దేవాలయం!
పిల్లల గొంతులు గుడిలో గంటలు,
మంచి మాటలు మన ప్రార్థనలు,
సంతృప్తి, సంతోషం తీర్థప్రసాదాలు!"

# కొండలమీద వెన్నెల

*గానం: B.సంధ్య, 3 వ తరగతి, టింబక్టు బడి, చెన్నేకొత్తపల్లి.*





కొండలమీద వెన్నెల కాసె ఎన్నెల్లాయెలో
ఎర్ర కాకి పెళ్ళి అంట ఎన్నెల్లాయెలో

కప్పపిల్ల కనుకొండె ఎన్నెల్లాయెలో
ఉడతపిల్ల ఊరిలో చెప్పె ఎన్నెల్లాయెలో

నాగపాము నలుగుతెచ్చె ఎన్నెల్లాయెలో
పూడు పాము పూలు ముడిచె ఎన్నెల్లాయెలో

పసుడు పాము పసుపు పూసె ఎన్నెల్లాయెలో
కుందెలు పిల్ల కుంకుమ పెట్టె ఎన్నెల్లాయెలో

మేకపిల్ల మేళం కట్టె ఎన్నెల్లాయెలో
పంది కొక్కు డోలు కొట్టె ఎన్నెల్లాయెలో

"కొండలమీద వెన్నెల కాసె"

# ఎందుకో..?

రచన: శ్రీ.వారణాసి వెంకట్రావు గారు, విజయవాడ.

గానం: కీర్తన, 9 వ తరగతి, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.



ఎందుకో.. ఎందుకో?

వసంతురాకఎందుకో(2)

'ఎందుకో..?'



ఆశలన్ని దూసి పోసి

అలమటించే మల్లె తీవెకు(2)

క్రొత్త చివురులు పల్లవింప,

జీవమొసగేటందుకే(2)

'ఎందుకో..?'

మూగవోయెను తనకు గళమని

 మూలవగచే కోయిలమ్మను(2)

మావి గుబురులు చేర బిలిచి

గళము మీటేటందుకే (2)

'ఎందుకో..?'

మధువు కరవై వ్యధను చెంది

తరువు తరువు తెరుగు తేటికి(2)

వేప తేనియ విందు చేసి

వెతను బాపేటందుకే(2)

ఎందుకో, ఎందుకో..?

వసంతురాకఎందుకో(2)

'ఎందుకో..?'

# కుహూ కుహూ



*రచన: శ్రీ.వారణాసి వెంకట్రావు గారు, విజయవాడ*

*గానం: అఖిల, కీర్తన, సరిగమ, 9 వ తరగతి, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*

కుహూ కుహూమని పాడే కోయిలమ్మా
అహో అహో ఎంత హాయి నీ పాటమ్మా!
'కుహూకుహూ'
రాగ తాళ బద్ధమైన సంగీత శాస్త్రమును
వత్సరాలు వెచ్చించి నేర్చిన వారైన
హాయినింపె ఒక్క గమకమనగలరా నీ వలెనే?
సామవేదమునకు ముందె సంగీత నిధివి నీవు
'కుహూ కుహూ'
యుగాల కాల గమనంలో వేగమంటు సంగీతం
రాళ్లు గిలకరించినటుల రణగొణ ధ్వని అయినది
విధాత నేర్పిన పాటే పాడుచుంటి వీవిపుడు
పసగలదీ పాతదైన రసహీనముకన్న మిన్న
'కుహూ కుహూ'




ఆమని శుభవేళ అరుదెంచిన తొలి అతిథీ
పిలుపులేక వచ్చానని మోము చూప వెరపా?
ఆత్మీయుల రాకెప్పుడూ ఆనందమె కదటమ్మా?
జగతి మరచు మగత- కలిగించు కూసె కూత
'కుహూ కుహూ'

# దండాలు దండాలు భారత మాతా!

*గానం: C. పవన్, 5 వతరగతి, K.వాణి, E.సుధ, S.నాగమణి, U.సుమిత్ర, T.ఆమని, టింబక్టు బడి, చెన్నేకొత్తపల్లి.*

*వాయిద్యాలు: కుండ: పి. విశ్వనాథ, డప్పు: పి. పోతులయ్య,*

*గజ్జెలు: మదన్‌మోహన్‌రెడ్డి, చెక్కలు: అనిల్‌కుమార్.*



దండాలు దండాలు భారత మాతా!
అవి అందుకుని దీవించు భారత మాతా !!
(2)

గాంధీ మహాత్ముడు భారత మాతా!
నీ ముద్దు కొడుకున్నాడే భారత మాతా!!(2)

నీ ముద్దు కొడుకుండగా భారత మాతా!
మా కేమి కొదవలేదు భారత మాతా!!(2)

తిట్టినట్టి వాండ్లను భారత మాతా!
తిట్టనైన తిట్టమమ్మ భారత మాతా!!(2)

కొట్టినట్టి వాడలను భారత మాతా!
కొట్టనైన కొట్టమమ్మ భారత మాతా!!(2)

మమ్ము చంపబోయినారు భారత మాతా!
కొంచెమైన జంకమమ్మ భారత మాతా!!(2)



కొంచెమైన బెదరమమ్మ భారత మాతా!
నీ పాదాల తోడు తల్లి భారత మాతా!!(2)

మూడువందల యేండ్లకింద భారత మాతా!
కంపెనోడు దిగినాడే భారత మాతా!!(2)

నీ ఊరు కొన్నాడే భారత మాతా!
మన దేశమెల్ల దోచినాడే భారత మాతా!!(2)

అడవులన్ని వాడివంట భారత మాతా!
వాడి అబ్బ వచ్చి వేసినాడ భారత మాతా!!(2)

సముద్రాలు వాడివంట భారత మాతా!
వాడి తాతలొచ్చి తవ్వినార భారత మాతా!! (2)

దండాలు దండాలు భారత మాతా!
అవి అందుకుని దీవించు భారత మాతా!!

కొత్తపల్లి పత్రికలో ప్రచురితమయ్యే పాటలన్నిటినీ మీరు ఇంటర్నెట్లో వినచ్చు! సందర్శించండి: http://kottapalli.in

# జారు బాబూ!

బొమ్మకు కథ

*నిర్వహణ: G.లలిత, telugu4kids.com*

ఇక్కడ ఇచ్చిన బొమ్మను చూడండి. ఈ బొమ్మను చూస్తే మీకు ఏమనిపిస్తున్నది?



జారుడు బండనెక్కిన చిన్న బాబు, జారమంటున్న తాత, వెనక వరసలో ఉన్న మరికొందరు పిల్లలు, ఆటస్థలం, .... ఇందులో ఏదో ఒక కథ దాక్కుని లేదూ? ఆలస్యం చేయకండి. మీ కథను తోచిన రీతిలో రాసి పంపండి మాకు. అది బాగుంటే కొత్తపల్లి పత్రిక **డిసెంబరు సంచిక**లో ప్రచురిస్తాం.

మా చిరునామా: కొత్తపల్లి బృందం, 2-312, న్యామద్దల రోడ్డు,
చెన్నేకొత్తపల్లి (మం)(పో)- 515 101
అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్.

## కొత్తపల్లి బృందం

**సారథ్యం:** సుబ్బరాజు

**ప్రధాన సంపాదకులు:** నారాయణ

**సంపాదక వర్గం:** మోహనయ్య, జయచంద్ర, మురళి.

**సాంకేతిక బృందం:** ఆనంద్, లక్ష్మి, లీల.

**చిత్రాలు:** వీరాంజనేయులు, అడవి, మారుతి.

**ఈ మాసపు జోకులు:** విష్ణు, చంద్ర.

**ఆర్థిక వ్యవహారాలు:** అలివేలమ్మ



## చందా వివరాలు

**సంవత్సర చందా:** 200/ రూ.

చందాను 'కొత్తపల్లి ట్రస్టు' పేరిట మనీఆర్డర్ లేదా డి.డి లేదా చెక్కు రూపంలో కట్టవచ్చును. డి.డి., చెక్కులకు బ్యాంకు చార్జీలు (25రూ) కలపాలని మనవి.

**చందాలకై చిరునామా:**

కొత్తపల్లి ట్రస్టు,
2-312, న్యామద్దల రోడ్డు, చెన్నేకొత్తపల్లి,
అనంతపురంజిల్లా, 515101.

**బ్యాంకు ద్వారా చందా కట్టడానికి వివరాలు:**

KOTTAPALLI TRUST,
A/c No:0138101018809 (Savings Type),
CANARA BANK, Chennekottapalli,
Anantapur District, A.P.
IFSC code: CNRB0000138.

డబ్బు కట్టిన వివరాలను ఇమెయిలు/ ఫోను/ ఉత్తరం ద్వారా కొత్తపల్లికి తెలియపరచగలరు.

ఇమెయిలు: team@kottapalli.in
ఫోను: 08559 240222.

**కృతజ్ఞతలు:**

పత్రికకోసం నిరంతరంగా పిల్లల రచనల్ని అందించి సహకరిస్తున్న ప్రకృతిబడి, టింబక్టు బడి, విజ్ఞం స్కూల్ యాజమాన్యాలకు కృతజ్ఞతలు. వెబ్ సైటుకు వెన్నుదన్నుగా నిల్చిన infogami యాజమాన్యానికి, దాన్ని సుసాధ్యం చేసిన python భాషకు, చక్కని ఆపరేటింగ్ సిస్టం linux ను అందించిన ubuntu వారికి, గొప్ప వ్యవస్థని పూర్తిగా ఉచితంగా అందిస్తున్న OpenOffice వారికి, తెలుగును రప్పిస్తున్న Unicode, Scim, Baraha లకు, చిత్రాలను సరిదిద్దే Software Gimp నిర్మాతలకు, శబ్దాలను చక్కబరచే Software Audacity నిర్మాతలకు కృతజ్ఞతలు.

మంచి పుస్తకం:

## టామ్ సాయర్

"... ఇది కాస్తా కూస్తా విషయమా? అర్థరాత్రి పూట- స్మ శానంలో-దెయ్యాలు తిరిగే చోట- హత్య జరగటం కళ్ళారా చూశారు. టామ్ కు ఇది తలుచుకునేటప్పటికి మళ్ళీ చెమటలు పోశాయి.

దుకాణం వసారాలో వెతకగా ఒక తోలుముక్క కనిపించింది. టామ్ జేబులోపొద్దున స్కూల్లో మేష్టారికి తెలియకుండా కొట్టేసిన సీమసున్నం పిక్కె ఉంది. పెదిమల మధ్య నాలిక నొక్కి పట్టి, తలకాయ అటూ ఇటూ ఊపుతూ టామ్ తోలుముక్క మీద ఇలా రాశాడు:

> *హక్ఫిన్, టామ్ సాయర్ ఈ రహస్యమును ఎవరితోనైన చెప్పిన ఎడల వారి శిరస్సులు వెయ్యి చెక్కలైపోవుగాక!*
>
> *ఇట్లు-*

ఇంతవరకూ టామ్ రాశాడు. టామ్ ఇంత చక్కని భాషలో, అంత తొందరగా రాయటం చూసి హక్ చాలా మెచ్చుకున్నాడు- (వాడికి అక్షరాలే రావు మరి!)"

పదిహేనేళ్ల పిల్లల్నించి తొంభైఏళ్ల ముసలి పిల్లల వరకూ అందరూ చదివి ఆనందించగల చాలా మంచి పుస్తకాల్లో ఒకటి, టామ్ సాయర్.

మార్క్ట్వేన్ రాసిన ఈ నవలికను చెప్పలేనంత అద్భుతంగా అనువదించారు డా.నండూరి రామమోహనరావు గారు. ఈ అనువాదం 1950 లలో ఆంధ్రపత్రికలో సీరియల్ గా వచ్చి, "అనువాదం అంటే ఇలా ఉండాలి" అన్న ఒరవడిని సృష్టించింది. ఆ తర్వాత లెక్కలేనన్నిసార్లు మళ్ళీ మళ్ళీ ముద్రించబడింది ఈ పుస్తకం.

ఇంకా చదవలేదా, ఈ పుస్తకాన్ని? అయ్యో, లేచి వెతుక్కోండి- మీకు దగ్గర్లోనే ఎక్కడో ఉంటుంది!




టామ్ సాయర్

రచన: మార్క్ ట్వేన్

అనువాదం: డా.నండూరి రామ మోహన రావు

ప్రచురణ: అభినందన పబ్లిషర్స్, విజయవాడ.

వెల: 65 రూ.